# కళాసౌధము

(నాటికలు)

శ్రీ. కే. ఎల్. నరసింహారావు

ప్రచురణము 30
దేశోద్ధారక గ్రంథమాల
2844, ఇమాంబాని వీధి, సికింద్రాబాదు

# మనవి



శ్రీ. కే. ఎల్. నరసింహారావు గారిని గురించి ఎరుగనివారు అరుదు. వారు హైదాబాదు రేడియో ద్వారాను, 'జనతా కళామండలి' ద్వారాను, వారు రచించిన ఎన్నోనాటకాలు ప్రదర్శించి ఎల్లరిమన్ననలు పొందుట ద్వారాను వారు బహుజన ప్రియులైనారు. అట్టివారి నాటిక లను ఈ గ్రంథమాలద్వారా అందించుభాగ్యము మాకు కలిగినందుకు ఆనందిస్తూ, శ్రీ కే. ఎల్. నరసింహారావుగారికి, గ్రంథమాలను ఆదరాభి మానాలతో పోషిస్తున్న దేశీయులకును మా అర్థిక కృతజ్ఞలను అందజేస్తున్నాము.

20—3—56
సికింద్రాబాద్

విన్నవించు
వట్టికోట ఆళ్వారుస్వామి
ప్రకాశకులు, స్థాపకులు



## రచయిత పరిచయం

1. జననం : 1927.
2. చిరునామా : పోస్టు: రేపాల, (via) జగ్గయ్యపేట (కృష్ణా జిల్లా)
3. కార్యకలాపాలు: వ్యవసాయము, సాహిత్యకృషి
4. అభిరుచి: నాటక రంగం.
5. రచనలు: ముద్రితం: ఆదర్శలోకాలు గెలుపు నీదే, కొత్తగుడి, (నాటకాలు,) ఒకరోజు, అపరాధపరిశోధకుల (నాటికలు,) తెలంగాణా తీర తెన్నులు (వ్యాసాలు)
   అముద్రితం: అడుగుజాడలు, సుడిగుండాలు, కాలప్రవాహం (నాటకాలు).
6. అభిమాన రచయితలు: గోపీచంద్, బుచ్చిబాబు, చలం, కొడవటిగంటి, శ్రీ శ్రీ, శరత్,

## నాటికలు

పుట

ఇ ం దు లో

లక్ష్మయ్య

| | | |
|---|---|---|
| భాస్కరం | ... | అతని పెద్దకొడుకు |
| మూర్తి | ... | అతని చిన్నకొడుకు |
| అప్పడు | ... | నౌకరు |
| రాధ | ... | భాస్కరం భార్య |
| శివరావు | ... | మందులషాపు యజమాని |
| శాస్త్రి | ... | మందులషాపు గుమాస్తా |

(అప్పడు పక్క వేస్తూ పాట గొణుక్కుంటుంటాడు. 2, 3, కుర్చీ లుంటాయి)

"సక్కనీ సరిబండమీనా—నాసామి
సెక్కదంచే సిన్నదానా
సెక్క వచ్చి సెంపదాకే—నాసామి
సెప్పరానీ దుక్కవొచ్చే....సక్కనీ....

(ఈ పాటను మరీ హుషారుగా పాడుతుంటే - బయట తలుపు చప్పుడవుతుంది. అప్పడు వినిపించుకోడు. చివరకు లోపల అన్నం వడ్డిస్తున్న రాధ - వడ్డన పరికరాల్తోటే వచ్చి)

రాధ : అబ్బబ్బ ! ఎప్పుడూ వెధవ పాటలూ, నువ్వూ. పాట ఆపేసి - బయటెవరో తలుపు బాదుతున్నారు. వెళ్ళి చూడకూడదూ?

అప్పడు : (తేరుకొని) పోతున్నానండి.

రాధ : ఎవరికోసం వచ్చారో కనుక్కొని - పెద్దయ్యగారికోసమైతే అన్నం తింటున్నారని చెప్పి కూర్చోబెట్టు.

అప్పడు : అట్టాగేనండి. (అప్పడు బయటకీ, రాధ లోపలికి వెడతారు. తిరిగి అప్పడూ శాస్త్రి రంగంమీది కొస్తారు.)

శాస్త్రి : ఏమన్నావూ ! అయ్యగారు లేరూ ?

అప్పడు : లేరన్లేదండి, ఏ అయ్యగా రన్నానండి.

శాస్త్రి : ఏ అయ్యగారేమిటి ! లక్ష్మయ్యగారు.

అప్పడు : ఆరైతె పెద్దయ్యగారుండి; బాస్కరం గారైతె సిన్నయ్య గారుండి; మూర్తిగారైతె బుల్లయ్య గారుండి.

శాస్త్రి : నాకు కావలసింది పెద్దయ్యగారే.

అప్పడు : అయితే - కూకోండి. బువ్వతింటున్నరు.

శాస్త్రి : మంచిది. (వస్త్రం సర్దిపెట్టుకొని కుర్చీలో కూర్చుంటాడు. అప్పుడు మళ్ళీ పక్కముడతలు శుభ్రం చేస్తా)

అప్పడు : పస్పుండీ! తవర్ని యాడో సూసిన మతికొస్తున్నదుండి.

శాస్త్రి : చూసే వుంటావు. శివరావుగారి మందులకొట్లో పనిచేస్తాలే.

అప్పడు : మా సిన్నయ్యగారి కొట్టుకు ఎదురుంగుంది కదుండి ?

శాస్త్రి : అవు నవును.

అప్పడు : తవరిపేరేందో తెలవదుండి ?

శాస్త్రి : శాస్త్రులంటార్లే.

అప్పడు : చాస్తుల్లుగారూ! తమకొట్లో నల్లమందు దొరుకుతాదుండి?

శాస్త్రి : పడ్డినట్టుంది. అడక్క అడక్క నల్లమందే అడిగావూ ?

అప్పడు : మా సంటోడు ఆరందినాలసంది వోశే పల్సంగ బోస్తుండుండి. దాని కింగ నల్లమందే అవ్వాల్దర్లా మందాంటున్రు, మా సిన్నయ్యగారి కొట్లో అన్నిమందులుండ యంటగని - అది లేదంట.

శాస్త్రి : అది అన్నిచోట్లా దొరకదులే (ఇంతలో లక్ష్మయ్య భోంచేసి వస్తున్న తేపును) అదిగో ! లక్ష్మయ్యగారు భోంచేసి వచ్చి నట్టున్నారు.

అప్పడు : ఈడికే వస్తారుండి, ఈ పక్క ఆరికేసుండి పసేది....మరి— నల్లమందు మాకేలుండుంటి ?

శాస్త్రి : అది మాదగ్గరకూడా దొరకదు.

అప్పడు : అవేంకొట్టుండీ.... సరె పోనీలేరిగని — శాస్త్రుల్లు గారూ! ఇయ్యాల రేపట్లు మంచిరో చెప్పుడుండి? జర వాకా పెన్నసెల్లెల్లి అస్తారింటికాడ్నుంచి తోలకొస్తా యనుకుంటుండ. (లోపల్నుంచి అప్పడూ! అని పిలుపు.)

శాస్త్రి : చెబుతాగాని— అదిగో! అయ్యగారు పిలుస్తున్నట్టున్నారు వెళ్లు. (అప్పడు లోపలికెడుతాడు. శాస్త్రి - పుస్తకాలను సర్దుకొని తయారుగా కూచుంటాడు. లోపల్నుంచి వచ్చేది లక్ష్మయ్యే మోననుకొని శాస్త్రి చప్పున లేస్తాడు. అప్పడని తెలుసుకొని మొగం చిట్లిస్తూ కూలబడ్తాడు.)

అప్పడు : ఒచ్చిందోరో కనుక్కోమంటున్నారుండి.

శాస్త్రి : చెప్పాగా—శివరావుగారి మందులకొట్లో పెద్ద గుమస్తా శాస్త్రి నని చెప్పు. (అప్పడు లోపలికెడతాడు.) అబ్బో! ఎవరో తెలుసుకొంది కనబడే రోజులు పొయ్యాయన్నమాట, దర్జా! ఏం చేస్తాం? ఖర్మ! (మళ్ళీ అప్పడే వస్తాడు. ఈ సారన్నా లక్ష్మయ్య కాకపోతాడా అని శాస్త్రి లేస్తాడు, పాపం! కాక పోవడంతో నిరుత్సాహంతో కూలబడ్తాడు.

అప్పడు : ఏం పనిమీనొచ్చిన్రో కనుక్కోమంటున్రుండి.

శాస్త్రి : అబ్బ! శివరావుగారు పంపితే వచ్చానని చెబుదూ. (మళ్ళీ అప్పడు లోనికెడతాడు. క్షణంలో అప్పడే ముందొచ్చి పక్క.

సర్దుతుంటే—లక్ష్మయ్య వెనక వస్తాడు. పక్కమీద కూచుంటాడు. లక్ష్మయ్య పక్కమీద కూచున్నాకగాని అతను వచ్చిన సంగతిని శాస్త్రి కనిపెట్టలేదు. హఠాత్తుగాలేచి నమస్కారం చేస్తాడు. ముందే లేవక పోతినే అనే కంగారులో పడ్తాడు. మళ్ళీ కుర్చీలో కూర్చోవడమే మరిచాడు.)

లక్ష్మయ్య : అం— ఏంపనిమీద వంపాడోయ్ ? (ఈ సంభాషణ ఉన్నంతసేపూ—అప్పుడు లక్ష్మయ్య కాళ్లు పిసుకుతూనూ, విసరుతూనూ గడపొచ్చు )

శాస్త్రి : (పద్దు పుస్తకాలు విప్పుతూ నసుగుతూ ) చిత్తం తమ పాత బకాయా....

లక్ష్మయ్య : ఎప్పటి బకాయోయ్ ? ఎన్నేళ్ళ క్రిందటి మాంటేమిటి ?

శాస్త్రి : అప్పుడే మరిచి పొయ్యారా ? 5, 6 పండ్లవుతున్నదండి. అంతే..

లక్ష్మయ్య : 5, 6 పండ్లక్రిందటి దాని కప్పుడేమిటోయ్ ? అయినా ఎన్నిసార్లడుగుతావేమిటి ? మొన్న కాదూ వచ్చి అడిగి పోయింది ?

శాస్త్రి : చిత్తం. అప్పుడే ముత్తాన్ని సెలవిప్పిస్తే—

లక్ష్మయ్య : మొత్తం మొత్తమని మహా పెద్ద మొత్తంగా చెబుతున్నావ్. ఎన్నొందలేమిటి ?

శాస్త్రి : ఎన్నోవంద లెక్కడండీ ? ఎబ్బే ! చూడమన్నారా ? (పుస్తకాలు విప్పుతూ) 150 పైె చిల్లర. అంతే.

లక్ష్మయ్య : వేరేమూసేదమిట్లే. అందులో వేసినవన్నీ బ్లాక్ మార్కెట్ రేటేగా ?

శాస్త్రి : శివశివా ! పెద్దలు - తమరలా సెలవిస్తే ఎలాగు ? అన్నీ తెలిసినవారు.

లక్ష్మయ్య : కనుకనే అంటున్నానోయ్. పోనీ - మందులన్నిటికీ బిల్లులు వేసిస్తావా ?

శాస్త్రి : తమరివేళ అలా సెలవిస్తే ఎలా ? బిల్లు లానాడే వేసిచ్చాం. చాలా సంవత్సరాలు కావస్తున్నది.

లక్ష్మయ్య : మావాడు సబిన్‌స్పెక్టర్ కాని రోజుల్లో నండూ.

శాస్త్రి : చిత్తం — కావచ్చండీ. తమరప్పుడు చాలా జబ్బులో ఉన్నారు.

లక్ష్మయ్య : ఔన్లే. ఆసమయము చూచి మీయిష్టమొచ్చిన రేట్లు వేసుకున్న రోజులేగా ?

శాస్త్రి : శివశివా ! మళ్లీ అదేమాట సెలవిస్తున్నారు, అలా వేసుకోదల్చుకున్న వాళ్లం అరువు పెడ్తామా?

లక్ష్మయ్య : మహా పెట్టారు అరువుగాని - ఇంతకూ నీచేమైనా దేనికి దానికి బిల్లులిస్తావా చెబుదూ ?

శాస్త్రి : అదిప్పుడెల్లా సాధ్యమండీ ? అయినా — నాకంత అధికారం లేదండీ.

లక్ష్మయ్య : మరి నీవెందుకొచ్చినట్లు ? పో - మీ యజమానినే రమ్మను.

శాస్త్రి : చిత్తం (పద్దుపుస్తకాలు చంకన పెట్టుకొని బయటికెడతాడు)

లక్ష్మయ్య : వెధవలు. బిల్లులు వేసిమ్మనేసరికి పీకె పట్టుకుంటుంది.

అప్పడు : మనం అన్నిమందులు ఎప్పుడు తీసుకున్నవుండీ ?

లక్ష్మయ్య : ఆఁ - వెనుకటి కెప్పుడో నట.

అప్పడు : మరి - మందులాడ ఎందుకు దెప్పించినట్టుండి, మన సిన్న య్యగారి కొట్టుండగ ?

లక్ష్మయ్య : అప్పటికి మనకొట్టుంటే—అక్కడికెందుకెడతాం ? మన వాడు కొట్టుపెట్టి నాలుగేండ్లైగా అయింది.

రాధ : (అందుకుంటుంది) మూడై తేనేం, నాలుగైతేనేం—వాడి కా. ఏమిటో మొహాన పారెయ్యకూడదు మావయ్యా ?

లక్ష్మయ్య : ఆహాఁ. అంత తేలిగ్గా పారెయ్యడమే ! ఆ ఎక్కువ ధరలు వేసినప్పు డెందుకివ్వాలి ? అప్పుడంటే తెలియక ఒప్పు కొన్నాంగాని— ఇపేళ్లా ఒప్పుకుంటాం ? అవన్నీ రెట్టింపు ధరలు.

రాధ : రెట్టింపో, గిట్టింపో — మరి ఆవేళ మన అవసరాలకు తోడ్పడ్డాడు.

లక్ష్మయ్య : అలాగని వాడు చెప్పినంతా ఇచ్చుకోమన్నావా ?

రాధ : పోనీ, ఇవ్వదలచుకుందేదో ఇచ్చెయ్యొచ్చుగా. దాని కిన్నేళ్లు ఆపాలా ?

లక్ష్మయ్య : ఆపడంకాదు. అసలే ఇవ్వను. ఏంచేస్తాడో. చూస్తాను.

రాధ: అదేంబాగు మావయ్యా, ఎవడెందులో బ్రతకాలో అందులో బ్రతుకుతాడు.

లక్ష్మయ్య: బ్రతుకుతాడేం బ్రతుకుతాడు. చూస్తాగా వాడి బ్రతు కేమిటో.

రాధ: ఏవోఁ మావయ్యా- ఇలా అనడం ఏం బాగాలేదు.

లక్ష్మయ్య: నీకు తెలియదుగాని— సుప్వి విషయాల్లో జోక్యం కలిగించుకోకు. వెళ్ళి భోంచెయ్యి.

రాధ: మూర్తయినా రాలేదే; పన్నెండు దాటలే?

లక్ష్మయ్య: పోలీసు ఉద్యోగాలకు పైమేమిటీ— వల్లకాదు; ఎప్పుడు ఎక్కడే ప్రమాదం జరిగినా వెళ్లాల్సిందేగా.

అప్పడు: అంద్లమన బుల్లయ్యగారు శనా కట్టం చేత్తారుండి.

రాధ: అతను చదువుకునే రోజులనుంచీ అంతే. అంతేకాదు—ముక్కుసూటి మనిషి కూడాను.

లక్ష్మయ్య: ఏమిటా ముక్కుసూటి? ఎవరిక్కావాలి ఈయన మంచి?

అప్పడు: సర్కారు మదుసుల్ల అట్టాటోరు ఓరుండరుండీ!

లక్ష్మయ్య: అదే వద్దనేది. ఏదో అవకాశం చిక్కినప్పుడే నాలుగు పైసలు సంపాదించుకోవాలిగాని- తరువాతేడిస్తే ఏముందీ?

రాధ: అందరికీ ఆ పద్ధతి నచ్చొద్దూ?

లక్ష్మయ్య: నచ్చకపోతే తర్వాత వాళ్ళే అడుక్కుతింటారు.

శివరావు: (ప్రవేశిస్తూ) రావొచ్చాండీ? (రాధ లోపలి కెళుతోంది)

లక్ష్మయ్య: ఆఁ ఎవరదీ?

శివరావు: నమస్కారమండీ! (కుర్చీలో కూచుంటాడు) తమరేవో బిల్సు కావాలన్నారట.

లక్ష్మయ్య: అన్నారంటే—వచ్చేవాళ్ళం అడగమంటయ్యా మరి.

శివరావు: అంతగా కావాలంటే ఎందుకివ్వను గానీండి. పెద్దలు-ఏదో మిషతో 5, 6 ఏండ్లనుంచీ బాకేస్తున్నారు.

లక్ష్మయ్య: అసలిన్నేళ్ళదాకా బాకీ ఏమిటోయ్- లిమిటేషన్ పట్టదే?

శివరావు: చిత్తం. తామిక లేదంటే లిమిటేషన్ పట్టినట్టేనండి.

లక్ష్మయ్య: ఆమాట నానోటిమీదుగా అనిపించాలనేగా ?

శివరావు: రామరామ. పెద్ద లట్లా అంటారా ?

లక్ష్మయ్య: పెద్దలని నువ్వు చూపిన గౌరవమేముందోయ్! అందరికీ వేసే బ్లాక్ మార్కెట్ రేట్లేగా మాకూ వేశావ్.

శివరావు: ఎంతమాట! తమపట్ల అన్యాయమా! అయినా- రేట్ల విషయం తమకు నేను వేరుగా చెప్పాలా? స్వయంగా తమ అబ్బాయిగారి కొట్టే వుందిగా. భాస్కరంగారినే అడగండి. పోనీ- నాకు దాని డబ్బే, లాభమే కావాలనేం లేదు. ఆ మందులను తమ కొట్లోంచి సెలవిప్పించినా అంతేచాలు.

లక్ష్మయ్య: ఆహాఁ. అసలు షాపుకే ఎసరు పెడుతున్నావే!

శివరావు: రామరామ. పెద్దలు అలా అనడం సబబుకాదు. మీకు రేట్ల విషయంలో అనుమాన ముందనబట్టి ఆ మాట అన్నానేగాని మరేం లేదు. అలాంటి దురభిప్రాయాలుంటే మేమేం చేరం చేస్తామండీ. ఎవరి అదృష్టం వారిది.

లక్ష్మయ్య: ఏమైనా— నీరేట్లు అవీ తనిఖీ చేయించవంది డబ్బిచ్చే వల్ల గాదు.

శివరావు: పోనీ— అదే చేయించండి త్వరగా.

లక్ష్మయ్య: మా మూర్తిరానీ చూస్తాను.

శివరావు: దీనికిన్నాళ్లాపాలటంటీ?- మీ విచిత్రం గాకుంటే.

లక్ష్మయ్య: ఏమిటామాట? విచిత్రమేమిటి ?

శివరావు: మరి లేకుంటే ఏమిటండీ— ముష్టి నూటా ఏభైరూపాయలు పారేయటానికి పెద్దలింత తిప్పలు పెట్టాలా? అప్పుడంటే ఇబ్బందుల్లో వున్నారని వూరుకున్నాం. ఇప్పుడేవండీ? పెద్ద బ్బాయిగారు సంపాదిస్తున్నారు; చిన్నబ్బాయిగారు సంపాదిస్తున్నారు.

లక్ష్మయ్య: సంపాదిస్తున్నారంటే — నీలాగా బ్లాక్ మార్కెటను కున్నావా?

శివరావు: పట్టుబడ్డప్పుడు కదండీ ఏమార్కెటైందీ తెలిసేది, అయినా ఆ వివరాలన్నీ నాకెందుకు లెండి. తామేదో సెలవిప్పిస్తే.

లక్ష్మయ్య: ఆఁ- ఇంత ప్రేలేవాడికి ఇంకా ఇచ్చేదేమిటి?

శివరావు: పోనీ— ఆ మాటే 5 పండ్ల క్రింద చెబితే కాకపోయిందా? ఎలాగైనా కొడుకు సబినస్పెక్టరు గదా అని బెదరిస్తారా?

లక్ష్మయ్య: ఏమిట్రా వాగేది?

శివరావు: లక్ష్మయ్యగారూ! అదృష్టం కలిసొచ్చిందని నీతి తప్పటం బాగుండదు. పరువు మర్యాద లందరికీ వుంటాయి. అరే తురే అనడం మంచిదికాదు.

లక్ష్మయ్య: చాల్లే— నోరుమూసికొని బైటికి నడు.

శివరావు: బాకీ తీసుకోనిగాని కదలను.

లక్ష్మయ్య: బాకీ పంబాకోయ్, ఎక్కడి బాకీ: దొంగ లెక్కలు వ్రాసి ఎందరి నోళ్ళలో దుమ్ముకొడుతున్నావో — అవన్నీ చూసి నీపని పట్టండే.

శివరావు: (పుస్తకాలు సర్దుకొని లేస్తూ) పనిట పని. మీరు నష్టపోతేమిటండి పని. మేమేమైనా వ్యాపారం రహస్యంగా చేస్తున్నామా? మీ అబ్బాయిగారికంటే నయమే.

లక్ష్మయ్య: (తటాల్న లేచి) ఏమిటా్రి వాగుడు ?

శివరావు: ఏమిటా మీ అబ్బాయిగారు ఇష్టమొచ్చినట్లు మందులమ్ముతుంటే దిక్కూ మొక్కూ ఏదీ? తేలికగా మేమొకళ్ళం మీకు దొరికామేం. మీబాకీ ఏం బాకీ అండీ. మా చిన్నమందొక్కదాని ఖరీదు చెయ్యదు. పాపమని ఇన్నాళ్లాగితే తమరు సెలవిచ్చేదిదా?—సరే కానివ్వండి. పైన భగవంతుడు లేడూ! న్యాయం ఎటుపోతుంది?

లక్ష్మయ్య: న్యాయం, గీయమని ప్రేలాపంటే కొంకు విరుగుతాయ్.

శివరావు: ఏమిటండోయ్ విరగటాలు? ఎవరి కొంకులు విరుగుతాయో ఎవరు చెప్పగలరు గనుక?.... ఈ బిల్లులని ఎప్పుడో అంటే మళ్ళీ తయారుచేసేవాళ్ళంగా. ఛూ (చరచరా వెళ్లిపోతాడు)

లక్ష్మయ్య: (కూలబడి) అరె వెధవ! ఎంత పొగరు, ఎంత పొగరు.

రాధ: (వస్తూ) ఏమిటి మావయ్యా ఈ రభస? మీ అబ్బాయిగారితో చెబితే ఆమాత్రం ఇవ్వక పోయ్యారా ?

లక్ష్మయ: ఏమిటీ? వాడికింకా డబ్బివ్వడమా నేను బ్రతికుండగానే.

రాధ: అదేమిటి మావయ్యా— బాకీ అన్నాక తప్పుతుందా? అయినా అంతవాణ్ణి పట్టుకొని అరే, తురే అనడం మాత్రం ఏం బాగు?

లక్ష్మయ్య: అరే, తురే కాదు. ఇంకా ఏమైంది వాడిపని. డొక్క చీరించనూ.... డొక్క హమ్మా !

అప్పడు: బుల్లెయ్యగారితో చెపితే సరేనుండి. అంత ఆరే సూసు కుంటారు.

రాధ: ఆఁ. ఇక అయిందానికీ, కానిదానికీ జోక్యం కలిగించుకోడానికి ఆయనది ఉద్యోగమా? మరేవఁన్నానా? ఏదో వెనకటినుంచీ ఆ వ్యాపారంలో వున్నాడు. పైగా మనకు మొదటినుంచీ ఆపదలో అక్కరకొస్తున్నాడు. ఇవాళ అవమానపరచడ మేంబాగు? ఏవఁన్నా అనుకోడూ?

లక్ష్మయ్య: అనుకుంటే అనుకున్నాడు. అనుకోనీ వెధవను! ఏమైనా అనుకోనీ, నీకివన్నీ ఎందుకే? అన్నం తిన్నావా?

రాధ: నా అన్నానికేం తొందర మామయ్యా. వారింకా రానేలేదు. మూర్తికూడా రాలేదు.

లక్ష్మయ్య: వాళ్లెప్పుడో వస్తారు. కాచుక్కూచోవద్దన్లే. నువ్వు తిన రాదూ?

రాధ: కాచుకోవడం లేదు; ఏం లేదు. ఆకలవుతే తింటాగానీ అత న్నట్లా పంపడం ఏం బాగాలేదు మామయ్యా. పిలిపించి ఎదో ఒకటి ఇచ్చి పంపండి. లేకుంటే అబ్బాయిలాలకైనా చెప్పండి.

లక్ష్మయ్య: ఏమిటే. మళ్లీ పిలిపించాలా? నీకు తెలియదు రాధా, నీవీ వ్యవహారంలో జోక్యం కలుగజేసుకోకు. వాడి విషయం నాకు చెప్పకు. వాడి తాతల దగ్గర్నుంచీ వాళ్ల మోసమిదే.

రాధ: ఇందులో మోసమేమిటో?

లక్ష్మయ్య: నీకు తెలియ చూడుకోమన్నాగా?

రాధ: నాకెందుకులే గాని— పెద్దవారు, మీకీ ఇబ్బంది ఎందుకు మామయ్యా— వాళ్ళ కొదిలెయ్యకూడదూ?

లక్ష్మయ్య: ఏం రాధా! నీ చనువు నాకు పాఠాలు నేర్పేదాకా వచ్చిందే? పో లోపలికి. (రాధ లోనికి వెడుతుంది. లక్ష్మయ్య పొగచుట్ట చుడుతూ) అరే! (వాసన చూచి) ఎక్కడిదిరా యీ పొగాకు?

అప్పడు: ఎంకటయ్య కొట్లదుండి.

లక్ష్మయ్య: వెధవది— ఇంత నాసిరకమేమిటి? మంచిది లేకపోయ్యావటరా?

అప్పడు: అదే వుందటనుండి.

లక్ష్మయ్య: మనకు గావాలని చెప్పలే?

అప్పడు: అందరికి వోచే సరుకటండి. ఏరే లేదంట.

లక్ష్మయ్య: అందరికీ ఒకటేనేం! వేరేలేదూ! నేను కావాలన్నానని చెప్పావా?

అప్పడు: అసలు నన్ను జూస్తేనే అల్లు ఎరకబడ్తారుండి.

లక్ష్మయ్య: అయితే— నీ స్వంతానికనుకున్నారో యేవో!

అప్పడు: లేదుండి. తమకు గావాల్నని గూడ జెప్పిన్నుండి.

లక్ష్మయ్య: అయినా లేదన్నాడన్నమాట, ఐతే తక్షణం పేసు రమ్మంటున్నానని వాణ్ణిట్లా పట్టుకురా. పో. (అప్పడు వెడతాడు. రాధ వస్తుంది).

లక్ష్మయ్య: ప్రతి వెధవకు నీల్గుడే; బయటవుంటే చెప్పినమాట వినరు. కొట్లో పెట్టిస్తే ఏడిచిపోతారు.

రాధ : ఆఁ అంటే, ఊఁ అంటే, కొట్లో బెట్టించడమంటావు. అది మన చేతిలో అంత తేలిగ్గా ఉందా మావయ్యా ?

లక్ష్మయ్య : చాల్లే - మళ్లీ ఎదురు మాట్లాడుతున్నావు.

రాధ : ఏమిటో—శివరావు కన్యాయంచేశారనిపిస్తున్నది మామయ్యా?

లక్ష్మయ్య : నాకు తెలియని న్యాయం నీకే తెలుసా ఏమిటి ?

రాధ : ఆవేశంలో మనమాశే మనంగాని న్యాయంమాట జ్ఞాపక ముండదు.

లక్ష్మయ్య : ఏమిటేవ్ ! అన్నీ పుస్తకాల్లో మాటలు వల్లిస్తున్నావు. చాల్లే. చప్పుడు చెయ్యకుండా కొంపలో పడుండరాదూ ?

రాధ : ఆడదాని మొహాన రాసుందదేగా ?

లక్ష్మయ్య : అదే రాసుంది. పో. ఎదురు మాట్లాడకు. ఎన్నిసార్లు చెప్పాలి ? (అప్పడొస్తాడు) ఏడిరా ?

అప్పడు : లేడుండి. కొట్టుకు తాలఁవేసి ఇంటికి బువ్వకు పోయిం డంటండి.

లక్ష్మయ్య : సరే—కాసేపున్నాక వెళ్లి పిలుచుకురా.

అప్పడు : అయ్యో తేరిగని గీ సంగతిన్నరా ?

లక్ష్మయ్య : ఏమిటదీ ? ఏమిటీ ?

అప్పడు : మన బుల్లయ్యగారు వోడ్నో మందుల కొట్టాయన్ను గిరప్తారు చేసిండంటిప్పుడు.

రాధ : ఆఁ ఏమిటీ ? ఏ మందుల కొట్టాయన్నట ?

అప్పడు : ఓ. ఎంతమందిలేరు. ఓర్నో తెలవదుండి. బజార్లజనం అనుకుంటుండరు.

లక్ష్మయ్య : ఇంకెందుకూ-వాళ్లే; శివరాంగారొళ్లే బస్తుంటుంది. వాడి వ్యవహారాన్ని గురించి మనవాడి కెన్నోసార్లు చెప్పాను.

రాధ : ఎందుకనట ?

అప్పడు : అది సరిగ్గ తెలవదుగనీరి—ఎక్కువ వరలకు అమ్ముతూ పట్టుకున్న రనుకుంటుందరు.

లక్ష్మయ్య : తప్పకుండావాడే. సందేహం దేనికి ?

రాధ : పోనిద్దురూ. కొట్టున్నవాడెవడు అమ్మడంలే అట్లా ?

లక్ష్మయ్య : ఇప్పుడు నీవనేదేమిటే ?

రాధ : నేననేదేంలేదు. అసలెవరో తెలియందే శివరావని పంపిస్తారా !

లక్ష్మయ్య : నీకెందుకే సందేహం. వాడే అయ్యుంటాడు.

రాధ : మీ పెద్దబ్బాయిగారింకా రాలేదు భోజనానికి. అప్పుడు ! నువ్వెళ్ళిచూచిరా. (అప్పడు వెడతాడు)

లక్ష్మయ్య : బజార్లో యింతగోల జరుగుతుంటే అప్పుడే ఎట్లా వస్తాడే ? దీనికింత పెద్ద రాద్ధాంత మేమిటి ?

రాధ : అదనికాదు. వేళయిందిగా. వేళపాటున భోంచెయ్యాలి పోయూరే అని.

లక్ష్మయ్య : వస్తాడు. రాకెక్కడికి పోతాడు ? అదిగో ! వచ్చేస్తే వున్నాడు. (మూర్తిప్రవేశం) మూర్తిలాగున్నాడే. (అతను చాలా గంభీరంగా వుంటాడు. ముడుచుకపోయిన మొహం. కాస్తసేపు కటిక నిశ్శబ్దం. మూర్తి టోపీతీసి స్టాండుకు తగిలిస్తాడు.)

మూర్తి : వదినే. అన్నం వడ్డించు. (రాధ లోపలికెళ్తుంది. మూర్తి కుర్చీలో కూలబడి విచారంగా వుంటాడు. లక్ష్మయ్య చుట్ట తగలేస్తూ)

లక్ష్మయ్య : ఎవరో మందులషాపువాణ్ణి అరెస్టు చేశావట. శివరావు గారేనా ?

మూర్తి : (ఆశ్చర్యంగా) ఆఁ! (అంటూ వుంటే)

లక్ష్మయ్య : ఏంచేశాడనేమిటి ?

మూర్తి : ఏంచేయలేదు గనుక ? మందుల్లో నీళ్లుకలిపి మనుషుల ప్రాణాలతో చెలగాట మాడాడు. సమయానికి మందులు దాచి అవసరాన్నిబట్టి డబ్బులాగాడు. తోటిలోకం రోగాల్తో కుళ్లుతుంటే - భయంకరంగా సంతోషించాడు. కరకరా కత్తులతో కోసేవాడికన్నా జాలుంటుందేమో గాని—

లక్ష్మయ్య : వీడి కెక్కడిజాలి ?

మూర్తి : పైగా నేను లక్షసార్లు చెప్పాను. మానవప్రాణాలతో చెలగాటా లాడవొద్దు అని.

లక్ష్మయ్య : నీవంత చనువివ్వడమే ప్రమాదమొచ్చింది.

మూర్తి : ఈ ఘోరాలనుగురించి నాతో వందలమంది మొత్తుకున్నారు. ఏం చేయగలను ? చాలారోజులు విన్నాను; చూచాను; సహించాను. రానురాను యీ దుస్థితిచూస్తే — ఆనాటి మన బాధలు గుర్తుకొచ్చాయి. మీరు మంచాన పడ్డప్పుడు మిమ్ముల బ్రతికించుకోడానికి పడ్డ కష్టాలన్నీ కళ్ళకు గట్టాయి. కడుపు తరుక్కుపోయింది. అన్యాయాన్నిక సహించలేక పోయాను. గత్యంతరంలేక అరెస్టు చేయవలసి వచ్చింది.

లక్ష్మయ్య : ఎందుకింకాజాలి ? నీవుకాబట్టి యిన్నాళ్లూరుకున్నావు.

మూర్తి : అవును. ఉన్న సంబంధ మలాంటిది.

లక్ష్మయ్య : ఏమిటా సంబంధం ? బోడిసంబంధం. తప్పు తప్పే. అసలు వాడికి మొదట్నుంచీ వున్నరోగమే అదిగా.

మూర్తి : అందుకే అలా చేయవలసివచ్చింది. తప్పలేదు. (తండ్రికి ముఖంచూపలేక మూలగా నుంచుంటాడు.)

రాధ : (వచ్చి) మూర్తీ! వడ్డించాను.

మూర్తి : నా కాకలి కావడంలేదొదినా ?

లక్ష్మయ్య : అదేమిట్రా — ఇప్పుడేగా వొడ్డించమన్నావు?

మూర్తి : అన్నాను. కాని వొద్దు.

లక్ష్మయ్య : ఏడిసినట్టుంది ! ఒక వెధవను అరెస్టుచేసినందుకు అంత బాధపడాలా ?

రాధ : మూర్తి మనసెప్పుడూ అంతే. అన్యాయాన్నెదుర్కోవాలనీ చూస్తాడు. కాని దానివల్ల ఎవరూ బాధపడకుండా ఉండాలనీ అనుకుంటాడు.

లక్ష్మయ్య : అదీ — యిదీ ఎలాకుదురుతుందిరా ?

రాధ : నీ స్వార్థంకోసం చేశావా? నీ విధిని నీవు నిర్వర్తించావు. అందులో తప్పేముంది మూర్తీ.

లక్ష్మయ్య : ఇంత పిరికివెధవ్వు ఉద్యోగమెలా వెలగబెడ్తావురా ?

రాధ: అధర్మాన్నెదుర్కొనడమంత కష్టమైందింకేముంది మామయ్యా? రా మూర్తీ ! అన్నంచల్లారి పోతున్నది.

మూర్తి : (ఇటుతిరిగి టోపీ పెట్టుకొని వెళ్ళబోతూ) అన్నంవద్దు వదినా! (తండ్రీ, వదినెలు ఆశ్చర్యపోతారు.)

రాధ : ఏమిటిమూర్తి! నిన్నెప్పుడూ ఇలాచూడలేదు.

లక్ష్మయ్య : ఆదేమిట్రా అంతదిగులుగా వున్నావు ?

మూర్తి : అవునొదినా! ఇలా ఎప్పుడూ అన్నయ్యనరెస్టు చెయ్యాల్సొస్తుందని అనుకోలేదు !

లక్ష్మయ్య :
రాధ : (ఆశ్చర్యంగా) ఆఁ.

లక్ష్మయ్య : (కోపంగా చుట్టవతలికి విసరి మూర్తిని నిలేసి) ఏమిటీ. భాస్కర్రానా ?

రాధ : (దుఃఖం బయటికి రాకుండా కొంగు నోట్లో పెట్టుకొని) ఏమిటీ ? మీ అన్నయ్యనా మూర్తీ అరెస్టు చేసింది ?

మూర్తి : అవునొదినా!

రాధ : ఎంతపనిచేశావు మూర్తీ !

లక్ష్మయ్య : చేతులెట్లాం వచ్చాయిరా వెధవా ? (అని మెడపట్టుకొని వూపి — చొక్కాపట్టి లాగి) మాట్లాడవేం వెధవ (అని ఫెళా ఫెళా కొడ్తాడు. రాధ అడ్డుపడి)

రాధ : అదేంపని మామయ్యా ?

లక్ష్మయ్య : ఏంపనా ? చీరేస్తాను పీణ్ణి. నా కడుపుచెడపుట్టాడు వెధవ. (మళ్ళీ ఫెళా ఫెళా కొడ్తాడు. మూర్తి బాధపడ్తుంటాడేగాని — మాట్లాడడు. జేబులోనుండి పిస్తల్ తీశాడు. తండ్రీ, వదినెలు వులిక్కిపడతారు.) చంపుతావురా. చంపు వెధవ. (రొమ్ము

చూపుతాడు) అన్న నంతపనిచేసినవానికి తండ్రి లెక్కే మిటి చంపు.

మూర్తి : (తాపీగా దుఃఖంగా) తీసుకో నాన్నా! తీసుకో. ఈ దెబ్బలకు పిడుచావడు, నాన్నా! దీంతో వెయ్యిదెబ్బ—నీ కసితీర్చుకో. అన్న నరెస్టుచేసిన పాపానికి దీనితో కాల్చు. (తండ్రి గఖాల్న లాక్కుంటాడు. మూర్తి - చావుకు సిద్ధంగా కండ్లు మూసుకొని నిలుచుంటాడు. రాధకు భయమేస్తుంది) చంపు నాన్నా! చంపు.

రాధ : అదేమిటి మావయ్యా చంపేస్తారా ? (రాధ కెప్పనుంటుంది. లక్ష్మయ్య పిస్తల్ క్రింద పడేస్తాడు. ఏడుపొస్తుంది. గబగబా వెళ్ళి పరుపులో మొహం పెట్టి దుఃఖిస్తాడు:)

లక్ష్మయ్య : నేనెలా చావను ? నా పరువేంకాను ? భగవంతుడా ! నన్నీస్థితిలో ఎందుకు పెట్టావు ? నాకీ కొడుకుల నెందుకు ఇచ్చావు ? నన్నప్పుడే ఎందుకు చంపెయ్యలేదు ? (దిండును నలుపుతాడు. అలాగే మంచంమీద కుములుతాడు.)

రాధ : అంతపనెందుకు చెయ్యాల్సొచ్చింది మూర్తి ?

మూర్తి : ఏంచెయ్యమన్నావు వదినా ? డబ్బు సంపాదనకోసం అన్న కక్కుర్తి మార్గా లవలంబిస్తుంటే ఆ నీచాన్ని చూస్తూ ఎలా సహించేది వదినా ?

లక్ష్మయ్య : (మళ్ళీ కోపమొస్తుంది) సహించలేకపోతే ఉరిపెట్టుకోలేక పొయ్యావు వెధవ ? ఛండాలుడా ? అని మళ్ళీ దగ్గరకొచ్చి మూర్తి చొక్కా పట్టి వూపుతాడు.) మాట్లాడ వేం ?

రాధ : ఏమిటా ఆవేశం మావయ్యా ?

లక్ష్మయ : ఆవేశమా! నవ్వ లేస్తాను వెధవను. ఇందుకేనటరా నీకు వాడి కాళ్ళు పీడికాళ్లు పట్టుకొని వుద్యోగం ఇప్పించింది?

మూర్తి : ఉద్యోగం లేకుంటే మాడి చచ్చేవాణ్ణి. కాని వచ్చాక యీ పని చేయక తప్పలేదు.

లక్ష్మయ్య : ఇదేనటరా నీవు చేసే పని?

మూర్తి : ఇంకేం చేయమన్నారు?

లక్ష్మయ్య : ఛూ — వెధవొచ్చావు? ఈ మాటనడానికి నోరెట్లా వచ్చిందిరా?

మూర్తి : న్యాయానికీ, దయకూ పొత్తు కుదరదు నాన్నా, నా మనస్తత్వాన్ని తెలుసుకొని కూడా యీ ఉద్యోగం యిప్పించారు.

లక్ష్మయ్య: ఇప్పించినందుకు చేశావుగా ఘనకార్యం.

మూర్తి : ఏం చేయను?

లక్ష్మయ్య : ఇదిగో చేశావుగా అధికారముందన్ని అన్నమీద చూపావు నీపరాక్రమాన్ని. నేనెన్నిసార్లు చెప్పాను శివరావుగాడి మోసాలను గురించి. వాడి జోలికి పోలేక అన్నను అరెస్టుచేసి నన్నవమాన పరుద్దామనేగా?

మూర్తి : నాకు మాత్రము అవమానముకాదా నాన్నా?

లక్ష్మయ్య : నీకేం - నీకు కీర్తొస్తుంది.

మూర్తి : (అదిరిపడేటట్టు) నాన్నా! నన్ను సూటిపోటీగా అని బాధపెట్టకండి.

శాధ : మరి మీ అన్నయ్య గతేమిటి మ్మూరి?

లక్ష్మయ్య : వాడక్కడ ఏడుస్తుంటే- ఆ స్వంతటికీ ఈయనే అధికారవు దామనేమో.

మూర్తి : నాన్నా ! (అంతా నిశ్శబ్దం, పిస్టల్ తీసుకొని వెళ్లిపోతాడు)

రాధ : మూర్తీ ! మూర్తీ ! అన్నం తినిపో.

లక్ష్మయ్య : వాడికిక్కడికే కడుపు నిండింది. ఇంకా అన్నమెందుకు?

రాధ : ఏమిటా మాటలు మావయ్యా- నీవేమీ ఆలోచించకుండా అనేస్తావు. అన్యాయంగా నోటిముందరి అన్నం తినకుండా పోతున్నాడు.

లక్ష్మయ్య : పోనీ వెధవను -వాడిమీదింకా జాలి దలుస్తా వెందుకూ ? ఎట్లాగన్నా చావనీ.

రాధ : అదేమిటి మావయ్యా-అంతా మూర్తి తప్పులాగానే మాట్లాడ్తావు.

లక్ష్మయ్య : నీవెంత తొణక్కుండా నిండుగా మాట్లాడ్తావేం వాడు చేసిన ఘోరం కళ్లారా కనబడ్తుంటే ?

రాధ : మీరు మాత్రం అంత అన్యాయంగా ప్రవర్తించడం ఏంబాగు మావయ్యా ?

లక్ష్మయ్య : ఏమిటా అన్యాయం ? పదిమంది చేసేపని వాడూ చేస్తున్నాడు. తప్పా ?

రాధ : పదిమంది చేస్తున్నారని తప్పుకాదని ఎట్లా అందాం?.... ఇంతకీ వారి సంగతేమైందో కనుక్కోడానికి వెళ్లవు మావయ్యా?-

లక్ష్మయ్య : ఆ వెధవ పరువు మర్యాద లేకుండా బజార్లో అరెస్టుచేస్తే శివరావూ వాళ్లూ చూస్తూండగా నేనేమని వెళ్లేది ?

రాధ : అదేమిటి మావయ్యా? ఇక వారి సంగతి ఏం గావాలె?

భాస్కరం: (అందుకుంటూ) ఎవరి గతి ఏమవుతుందో ఇక తెలుతుంది.
(చెదరిన జుట్టూ, గుండీలు తీసివున్న షేర్వానీతో అవమానంతో భాస్కరం ప్రవేశం. మాట్లాడకుండా వెళ్లి షేర్వానీ విప్పి స్టాండుకు తగిలిస్తాడు.)

లక్ష్మయ్య : ఏమైందిరా?.......మాట్లాడవేం ?

భాస్కరం : తమ్ముడు చేసిన పని చూశారుగా?

రాధ : మీరెట్లా వచ్చారు ?

భాస్కరం : రాక. అక్కడ కూచోలేదనా నీ చింత ?

లక్ష్మయ్య : అదేమిట్రా- నీ కోపమంతా దానిమీద చూపిస్తావ్ ?

భాస్కరం : మన కోపం చూపడానికింకెవరున్నారు ?

లక్ష్మయ్య : ఇంతకూ బైటికెల్లా వచ్చావురా?

భాస్కరం : ఈయన అరెస్టు చేస్తే ఇక బైటికొచ్చే మార్గాలే లేవా ? ఈ వెధవకంటే పెద్దవాళ్ళు లేరూ ? మన వెధవకు కాకుంటే వాళ్లకైనా విశ్వాసం ఉండదూ ? పీడికన్న బజార్లో కుక్కనయం. కాస్త కూడు పడేస్తే కొంపను కాపాడుతుంది.... వీనిమీద పరువునష్టం దావా వెయ్యకపోతే నా పేరు భాస్కరం కాదు.

రాధ : అయిపోయిందేమో అయిపోయింది. మళ్లీ ఇదంతా ఎందుకు పోనిద్దురూ !

భాస్కరం : వాణ్ణి ఊరికే పోనిస్తానా ?

రాధ : పోనివ్వక, ఇంకా పంతాలెందుకండీ? ఎంతైనా అన్నదమ్ములు

భాస్కరం ! తమ్ముడు, తమ్ముడు. రానీ చెబుతాను; వీడి సిల్లును దంచేస్తాను. బజార్లో ఆయన అధికారి అయ్యాడు; నేను నేరస్థుణ్ణయ్యాను.

లక్ష్మయ్య : అంత ఇదెందుకొచ్చిందిరా ?

భాస్కరం : ఆ ధర్మమేమిటో ఆయనకే తెలియాలి.

రాధ : అన్నిసార్లు చెప్పాక కూడా ఆయన ఎదుటే అలా అమ్మటం ఏంబాగు ?

భాస్కరం : ఈవ్వాళ్ళేమైన క్రొత్తగా అమ్ముతున్నానా? నాలుగేండ్ల నుంచి అమ్ముతున్నాను.

లక్ష్మయ్య : వాడి పొగరు గాకపోతే అంతా అమ్మటంలే ?

భాస్కరం : ఆ దమ్ములుంటే ఇట్లా ఎందుకేడుస్తుంది ? ఎటుబడి అన్నొకడు తేలిగ్గా దొరికాడు. ఇక చూస్తాను, వాడి ఆటలేమిటో? పాపం మనవాడని ఊళ్ళో ఉండనిస్తే ఇదా పొగరు? ఇక క్షణమాగు, వాడి గతేమవుతుందో తెలుస్తుంది.

లక్ష్మయ్య : ఏమైనా వాడి ఉద్యోగానికి ముప్పొచ్చే మార్గం చూశావా భాస్కరం. అయిపోయిందేదో అయిపోయింది. వచ్చాక మందలిద్దాము.

భాస్కరం : అలాంటి వెధవకు ఉద్యోగం ఎందుకు? నాలుగు పిటీషన్లు కూడా తగిలిస్తేగాని రోగం కుదరదు.

రాధ : చాల్లెండి. దానికోసం ఎన్ని తిప్పలు పడ్డారో ఆలోచించండి.

భాస్కరం : ఆ తిప్పలకు తగ్గ ఫలితం దక్కిందిగా? పాపం అని పాలు పోస్తే పాము కాటేసింది చాలదూ ?

లక్ష్మయ్య : చాల్లెద్దూ. ఏదైనా అంత మంకుపట్టుదల బాగుండదు.

భాస్కరం : వాడి బ్రతుకో, నాబ్రతుకో తేలాలి.

రాధ : మూడొచ్చులేండి గాని ఒంటిగంట దాటింది భోంచెయ్యండీ.

భాస్కరం : ఎప్పుడూ కూడా! కూడా! కూడా! మీ ఆడాళ్లతో ఇదే ఘోష.

రాధ : సరే మీయిష్టం.

లక్ష్మయ్య : ఏమిట్రా తొందరపాటు ?

భాస్కరం : తొందరపాటట- తొందరపాటు. నాకడు వెలా దహించుకు పోతుందో మీకేం తెలుసు ?

రాధ : అయినా, అంత ధరలు మాత్రం ఎందుకెయ్యాలండీ?

భాస్కరం : నీకోసం, నీ నగల కోసం, నీ బాగుకోసం.

రాధ : నేను నగల్లేక ఏడుస్తున్నానని మీతో చెప్పానా ?

భాస్కరం : లేకుంటే నాకోసమా ? పాడుదానొచ్చావు, ఏమిటీ ? వాణ్ణి సమర్థిస్తున్నావ్. కారణం ఏమైనా...............(అని భార్యను కొట్టబోతాడు)

లక్ష్మయ్య : (అడ్డుపడి) ఏమిట్రోయ్- ఇలా పిచ్చివాడివవుతున్నావేం. అదేం పని భాస్కరం ?

భాస్కరం : లేకుంటే దీని కూతలు జూడు. నేనేదో తప్పుడుగా అమ్మేనట. నేనొక్కడ్నే అమ్మేనా ? లోకమంతా అమ్మింది. వాళ్లను పట్టుకున్న వాడేడి?

రాధ : మగవారు. ఎలా ఊహించుకున్నా సమర్థులే, నిజం అంటే ఇవేగా ముట్టేవి ?

భాస్కరం: నిజమానె, రాస్కెల్ ! (అని పెడ పెడా కొడుతాడు) నిజమా !

(మూర్తి వచ్చి అడ్డుపడతాడు)

మూర్తి: (కోపంగా) ఏమిటన్నయ్యా ఇది ?

భాస్కరం: ఏం? వదినగారిమీద అంత దయ ఏమైనా...

మూర్తి: (దద్దరిల్లేటట్లు) అన్నయ్యా ! (చెయ్యెత్తి క్షణమాగి) నీ తప్పుడు కండ్లకు అంతా అన్యాయంగానే కనపడుతున్నదా ! (చెయ్యిదించి) అన్నయ్యవై పోయ్యావ్.

భాస్కరం: లేకుంటే కొట్టేవాడవేమో? తమకేం, ఏమైనా చేయ గలరు. అసలు ఈ యింట్లో కేమని వచ్చావ్ రా - ధవ (కోపంగా మెడ నొక్కుతాడు-మూర్తి మాట్లాడడు.) మాట్లా డవేం ?

మూర్తి: మాట్లాడటానికి రాలేదు.

భాస్కరం: మరి దేనికొచ్చావ్ ?

మూర్తి: (వెళ్లి ట్రంకు చేతిలో పట్టుకొని) వెళ్లిపోవడాని కొచ్చాన

లక్ష్మయ్య: ఏమిటది మూర్తి ?

మూర్తి:-ఏంలేదు నాన్నా, నాకు ట్రాన్స్ఫరైంది.

లక్ష్మయ్య:-బదిలీయా?

మూర్తి:-అవును బదిలీ నాకు తెలుసు ఇలా అవుతుందని.

భాస్కరం:-ఇంతేకాదు. ఇంకేమైనా అవుతుంది.

మూర్తి:-నన్నేదో సాధించాలని చూడకన్నయ్యా. ఇది నాకు ఉపకారానికే వచ్చింది. ఇప్పుడు నావిధి నిర్వహణకు అడ్డుపడే వారెవ్వరూ లేరు. కాని—ఒక సంగతి మరచి పోకు—అన్నయ్యా, నువ్వు ఏ అవినీతి పద్ధతులవలంబించి బయటికొచ్చి-నన్ను ట్రాన్స్‌ఫర్ చేయించడానికి ప్రయత్నించావో-అవే పద్ధతుల్తో నీకు ముప్పుతెచ్చే వాళ్లున్నారనికూడా ఆలోచించుకో.

భాస్కరం:-ఏవో ధర్మబోధలుచేసి నన్ను బెదిరించకు.

మూర్తి:-అవున్లే. నీకేనాడు ఏ ధర్మమూ అక్కర్లేదు. డబ్బు సంపాదించడమొక్కటే ధర్మం. ఆ సంపాదనలో ఎందరి ప్రాణాలు పోయినా, ఎందరు అపాయాలకు లోనైనా నీకు చీమ కుట్టినట్టయినా వుండదు. ఒక్కనీ ప్రాణం మాత్రం క్షేమంగా వుండాలి. నీ ప్రాణరక్షణకూ, నీ పనులను కప్పి పుచ్చుకోడానికీ, ఆ డబ్బునే ఉపయోగిస్తావు. కాని—మళ్ళీ చెబుతున్నాను: ఒక్క సంగతి మరచిపోకు. అదే పద్ధతిని అవలంబించి నిన్ను చిత్తు చేసే వాళ్ళు కూడా వస్తారు. మీ అహంకారం, అవినీతి ఎన్నాళ్లో నిలవదు... ....సరే వస్తాను. (అందరికి నమస్కరించి వెడతాడు)

లక్ష్మయ్య:-మూర్తీ ! మూర్తీ! వెళ్ళకు తండ్రీ. నా కళ్ళముందు నుంచి వెళ్ళిపోకు.... ఎంత పని చేశావు భాస్కరం?

భాస్కరం:-ఏడి పని ఇంతటితో అయిందీ?

లక్ష్మయ్య:-నీకు హృదయం లేదురా భాస్కరం నీకు హృదయం లేదు. వాణ్ణి చూసుకొనే కదూ ఇన్నాళ్ళూ నేనైనా, నీవైనా అటలాడింది?

భాస్కరం:-అలాగని వీడు ఇంత అవమానపరుస్తాడా?

లక్ష్మయ్య:-ఎన్నాళ్లకూ వినకుంటే వాడు మటుకు ఏం జేస్తాడురా?

భాస్కరం:-ఏం చేస్తాడు. ఇదిగో—చేసినందుకు చూశారుగా ఫలితం. అన్న గదా తేలిగ్గా అరెస్టు చేసి కీర్తి సంపాదింతానను కున్నాడు.

లక్ష్మయ్య:-మరి నువ్వేం సంపాదింతా మనుకొన్నావురా?

రాధ:-డబ్బు.

భాస్కరం:-ఏమిటే అంత పొగరా!

(చప్పున భార్యను కొట్టబోతుండగా గబగబా అప్పడొస్తాడు)

అప్పడు:-సిన్నయ్యగారూ! సిన్నయ్యగారూ! మన మందుల కొట్టు కాడ జూసిన్రా?

భాస్కరం:-(భార్యను కొట్టబోయేవాడు ఆగి) ఏమైందిరా?

అప్పడు:-గుమస్తాగారు గజగజ వొనుక్కుంటు నిలబడ్డరు. మీ కాడి రానియ్యటం లేదట.

భాస్కరం:-ఏమైందిరా?

అప్పడు:-ఓరో మనకొట్టుకొచ్చి మందులు తనకి జేస్తున్రంట.

భాస్కరం:-ఆఁ ఎవడి కంత ధైర్యం!

అప్పడు:-శివరావుగారి గుమస్తా అంత ఎంబడుండి సేయిస్తున్రుమండీ.

భాస్కరం:-ఆఁ శివరావుగాడా! వీడికింత పొగరా!

(అలాగే వెళ్ళి పోతాడు).

లక్ష్మయ్య:-హోరి భగవంతుడా! ఎన్ని కష్టాలు తెచ్చి పెట్టావేరా?

రాధ:-ఇందులో భగవంతుడు తెచ్చి పెట్టిన ఏమున్నాయి?

(లోపలి కెడుతుంది)

లక్ష్మయ్య:-అవును. మనమే తెచ్చి పెట్టుకున్నాం. అబ్బా-నీకెంత గుండె నిబ్బర మేమే. (పక్క-మీద కూర్చుంటూ) అప్పడూ! బజార్లో ఏమను కుంటున్నార్రా!

అప్పడు:-కొట్లో దొంగ మందులు, దొరకని మందులు కనా, వున్న యంట. ఎతుకుతుంటె బైటికెల్లు తున్న యంట.

లక్ష్మయ్య:-ఇక చెప్పకురా అప్పడూ! చెప్పకు. వీడిపని ఇలావుంది. వాడి పని అలా అయింది. మూర్తీ! మూర్తీ! (విచారంగా పక్క-మీదికి ఒరగ బోతుండగా అప్పడు శివరావు వచ్చేది గమనిస్తాడు)

అప్పడు:-బుల్లెయ్యగారు ఎల్లిపొయ్యారు గదండి. అంగో మల్ల శివ రావుగారొచ్చిన్ను. (లక్ష్మయ్య చప్పున తలెత్తి చూస్తే శివ రావు బిల్లు కాయితాలతో నిలుచొని వుంటాడు)

శివరావు:-ఇవిగో నండీ—తమకానాడిచ్చిన బిల్లుల నకళ్ళు.

లక్ష్మయ్య:-ఆఁ. తెచ్చారా? అప్పడూ! అమ్మగార్నడిగి 150 రూపా యిలు పట్టుకొని రాపో.

(అప్పడు లోపలికెడతాడు.)

లక్ష్మయ్య:-కూర్చో శివరావ్!

(శివరావు కుర్చీలో కూర్చుంటాడు)

ఆఁ. మా కొట్టు దగ్గర ఏమిటో గొడవగా వుందన్నారు! ఏమిటది?

శివరావు:-ఏదోలెండి. అదంతా పోలీసు వారు చూసుకుంటారు.

లక్ష్మయ్య:-చెప్పు శివరావ్.

శివరావు:-మీ అబ్బాయి గారేగా ఇనస్పెక్టరు. వారొచ్చాక తెలుసుకోండి.

లక్ష్మయ్య:-అంతేనా?

(అప్పుడు డబ్బు తెస్తాడు. లక్ష్మయ్య డబ్బిచ్చి బిల్లులు తీసుకుంటాడు)

శివరావు:-ఏమండీ—కొంకులు విరగ్గొట్ట లేదేమండీ?

లక్ష్మయ్య:-అదంతా మనసులో పెట్టుకోకు శివరావ్

శివరావు:-ఇప్పుడిక నాచేతిలో ఏమీలేదు.

లక్ష్మయ్య:-ఏమీ లేదా.

శివరావు:-లేకుండా చేశారు మీరు. క్షమించండి. వస్తాను.

(వెడతాడు. రాధ వస్తుంది)

రాధ:-శివరావుకు డబ్బిచ్చారా మామయ్యా?

లక్ష్మయ్య:-డబ్బిచ్చినా ప్రమాదం తప్పేట్టులేదు. కానీ—ఏం చేస్తాం? నువ్వింకా అన్నంతిన్లేదుగా?

రాధ:-ఈ ఇంట్లో ఇక అన్నంతినే పరిస్థితి కూడానా? ఏమోలెండి అంతా తెలిసిన వారే.

(తిరిగి లోపలి కెడుతుంది)

లక్ష్మయ్య:-రాధా! రాధా! (రాదు)

అప్పడు:-లోపలికి పోయిందమ్మ.

లక్ష్మయ్య:-అవును. నాతో ఎవరూ మాట్లాడరిక. నువ్వూ వెళ్ళు అప్పడూ.

అప్పడు:-పండుకోరి దొరా! కాళ్లొత్తుత.

లక్ష్మయ్య:-ఒద్దప్పడూ—నన్నొక్కణ్ణే ఆలోచించుకోనీ. నన్నొక్కణ్ణే వెళ్ళు అప్పడూ. వెళ్ళు

అప్పడు:-సర్లే దొరా.

(అప్పడు లోపలి కెడతాడు)

లక్ష్మయ్య:-ఎంతలో ఎంతపని! మూర్తీ! నా పంక్తీ!

(పక్క మీదికి ఒరుగుతుండగా)

[ తెర ]

ఇందులో

| | | |
|---|---|---|
| భద్రయ్య | .... | పక్షవాతరోగి |
| రామం | ... | భద్రయ్య తమ్ముడు |
| రత్తమ్మ | ... | ,, భార్య |
| గౌరి | ... | ,, కూతురు |
| బాబు | ... | ,, కొడుకు |
| వెంకట్రావు | ... | రత్తమ్మ అన్న |
| డాక్టరు | ... | |

# అభాగ్యులు

## భద్రయ్య ఇల్లు

### హాలు

[బీదస్థితిలో వున్న మధ్యతరగతి కుటుంబాన్ని సూచించే సామాన్లుంటాయి. ఒకవైపు పాతబడ్డ పడకకుర్చీ, దాని ప్రక్కన ఒకబల్ల - బల్లమీద కొన్ని పుస్తకాలు వుంటాయి. మరోవైపు నులకకుక్కి మంచం, దండెం వుంటాయి. అక్కడక్కడా భద్రయ్య ఆరోగ్యంగా వున్నప్పుడు దిగిన ఫొటోలుంటాయి. పడకకుర్చీకి కోటు, గొడుగు తగిలింపబడ వుంటాయి.

అప్పుడప్పుడే తెల్లవారుతున్నది. కుక్కిమంచమ్మీద 'రామం' ముసుగుపెట్టి గుర్రు తీస్తున్నాడు. రత్తమ్మవచ్చి—మరిదిని 'రామం, రామం' అని పిలిచి లేపప్రయత్నిస్తుంది. కాని - అతను లేవడు. ఏమీ చేయలేక చప్పున జ్ఞాపకమొచ్చినట్టు చేతిలోవున్న చెంబులోని నీళ్ళు చుక్కలు అతని చెవిలో పోస్తుంది. రామం అటిటు కదులుతూ - 'స్టార్టయ్యాక లేపండెహె' అని మళ్ళీ పడకలో పడ్తాడు]

రత్తమ్మ : రామం. లేలే. ఇది లారీ వ్యవహారం కాదు. ఒక్కసారి లేచిచూడు. (మళ్ళీ చెవిలో నీళ్ళుపోస్తుంది. ఉలిక్కిపడిలేస్తాడు)

రామం : (లేస్తూనే) అప్పుడే కోడికూసింది! ....ఓస్ నువ్వా వదినా— సూ క్లీనరను కున్నాను. (లేచి మంచంమీద ముడుచుకొని కూచుంటాడు. దువ్వనితల, మాసిన బనీను, నిక్కరు అతని వేషం)

రత్తమ్మ : ఏమిటయ్యా - ఇంత పొద్దెక్కేదాకా పడుకున్నావ్ ?

రామం : సరిపోయింది. నేనసలు ఇంటికొచ్చిందెప్పుడు ? తలుపు తీసింది నువ్వేగా — తెలియదూ ? తెల్లవారుఝామున మూడో, నాలుగో అయివుంటుంది.

రత్తమ్మ : ఏమైనా ఖర్తీ వేసుకొచ్చారా ?

రామం : ఏం ఖర్తీ, లారీచెడిపోయి ఏడుస్తుంటేనేమో. సామాన్లవీ ఇక పట్నంనుంచి రావాలి. అందాకా మనకు సెలవు. అంటే 10, 15 రోజులదాకా నిరుద్యోగ మన్నమాట.

రత్తమ్మ : సరేగాని — కాస్తలేచి పాలు కొనుక్కు రాఅయ్య. ఇంకా వాలమనిపి రాలేదు. అన్నయ్య తొందరగా వెళ్ళా లంటున్నాడు.

రామం : ఏ అన్నయ్య ? మీ అన్నయ్యా ? మా అన్నయ్యా ?

రత్తమ్మ : పరిహాసమా రామం. మీ అన్నయ్యా, నేనూ ఇహా ఒక్క సారే ప్రయాణం. మీ అన్నయ్యకాదు — మా అన్నయ్యే.

రామం : ఎవరన్నయ్యయితే ఏమిటిగాని — కాస్త లోటాన్నూ, డబ్బూ ఇట్లా పంపు.

రత్తమ్మ : డబ్బులు నీ దగ్గరేమీ లేవూ ?

రామం : సరిపోయింది. నిన్ననేగా నా జీతంలో 30 రూపాయలు రొక్కం పోశాను. 5 రూపాయలు చుట్ట పీకలకుంచుకున్నాను.

రత్తమ్మ : అందులోవే ఓ బేడాబెట్టి తెస్తూ — తర్వాత చూతాం.

రామం : ఇలాంటి తర్వాతలు ఎన్ని చూళ్ళేదు గాని — కాస్త లోటా అన్నా ఇట్లాం పడేస్తావా - అదీ కొనుక్కు రమ్మంటావా ?

రత్తమ్మ : పరిహాసంగా వుంది బతుకు. (వెడుతుంది)

రామం : అంతేగామరి. (ఒళ్లు విరుస్తూ లేచి మంచంమ్మీద పక్కన పెట్టుకున్న చుట్టల్లో ఒకటితీసి నోట్లో పెట్టాడు. అగ్గిపెట్టె తీస్తే పుల్లలుండవు. పారేస్తాడు)
బాబూ! బాబూ! (పిలుస్తాడు. పిలుస్తాడేగాని - ఎవరొచ్చేదీ గమనించడు. రత్తమ్మ గ్లాసుతో వస్తుంది)

రత్తమ్మ : ఎందుకూ ?

రామం : చుట్ట తాగుతావేమోనని. (వదినని గ్రహించి) ఓ—నువ్వా !

రత్తమ్మ : చుట్టలేమిటయ్యా! బాబుకు చుట్టలు కూడా నేర్పుతున్నావా ?

రామం : సరిపోయింది. అన్నీ మనమనుకున్నట్టే జరుగుతాయా వదినా ? .... కాస్త అగ్గిపెట్టె తెస్తాడేమోనని.

రత్తమ్మ : బాగానే వుంది బతుకు. నువ్విప్పుడు చుట్టతాగి బయలుదేరాలా ?

రామం : క్షణం. నువ్వగ్గిపెట్టె లోపల్నించి విసిరి పుచ్చుకొని పారేఝుంచు. ముట్టించి దమ్ములాగుతూ వెడతాను. అంతే. క్షణమంటే క్షణం.

రత్తమ్మ : ఏం క్షణమో— తొందరగా రావాలి.

రామం : అంతా మనమనుకున్నట్టేనా ? (గ్లాసు తీసుకుంటూ) అలాగేలే. (మేరేమౌలా బులాలో* అనే ఫక్కీలో 'నన్నా నన్నన్నానా-న్నన్నాన్నా- నన్నానా - నన్నా -నన్నన్నాన్నా' అని గొణుగుతాడు. రత్తమ్మ అగ్గిపెట్టె తెచ్చిస్తుంది.)

రత్తమ్మ : కదులు తొందరగా.

**రామం :** ఇదిగో — క్షణం. (చుట్ట వెలిగిస్తాడు)

**రత్తమ్మ :** చుట్టపొగంతా పాలల్లో పూదకు. అన్నయ్యకు పొగంటే పడదు.

**రామం :** సరిపోయింది. మొదట్లో నాకు మాత్రం నచ్చింది. అలవాటవుతాం. అంతే. (రత్తమ్మ లోపలికి పోతుంది. రామం- జేబునుంచి బేడతీసి-గ్లాసుమీద దరువుగా వాయిస్తూ)

పాలు అయితే ఏమిరా
పాషాణమైతే ఏమిరా
ఈ పాడుప్రాణికి
పాషాణమే వేతామురా

నన్నా-నన్నా నానా- నన్నా నా-నన్నా నా-నన్నా-నన్నా నానా (అంటూ బయలుదేర్తాడు. అతనలా వెడుతుండగానే వెంక టాద్రివు లోపలినుంచి వచ్చి కుర్చీకి తగిలించిన కోటు వేసు కొని, గొడుగు తీసుకుందామని ఉద్దేశ్యం. ఇంతలో రామం పాట చెవిన పడుతుంది. అది వింటూ కాసేపు వుంటాడు. పాట దూరమవుతుంది. చెల్లెలు రత్తమ్మను పిలుస్తాడు.)

**వెంక :** రత్తమ్మా !

**రత్తమ్మ :** (వచ్చి) ఏంటి అన్నయ్యా ?

**వెంక :** మీ మరిది ఎక్కడికి వెడుతున్నాడు ?

**రత్తమ్మ :** పాలకన్నయ్యా. రోజూ వచ్చే పాలమనిషింకా రాలేదు. అందుకని-

**వెంక :** సరిగాని- అతనేం పాడుకుంటూ వెడుతున్నాడో విన్నావా?

రత్తమ్మ : ఏదో పాడుకుంటూ వుంటాడు. మేను అవేమీ పట్టించు కోము లే.

వెంక : అవున్లే. మీరేవి పట్టించుకున్నారు గనుక - ఆ విషయం పట్టించుకోడానికి.

రత్తమ్మ : అదేమిటన్నయ్యా - అలా అన్నావు ?

వెంక : ఉంటే తప్పులేదుగాని- అంటే తప్పొచ్చిందా ?

రత్తమ్మ : అంటేమాత్రం ఏం తప్పులే. అయిన వాళ్లు కాకుంటే కానివాళ్లంటారా ?

వెంక : అందుకే ఇలా పట్టుకొని ఏడవడం.

రత్తమ్మ : అంత మాటెందుకనా అన్నయ్యా ?

వెంక : ఎందుకా ? ఒక్కదానికైతే గదూ, ఒక తెల్లటిచీర కట్టిన పాపాన పోవైతివి. ప్రతివారూ- 'నీచెల్లెలు అదేమిటి అట్లా వుంటుంద'ని అడుగుతుంటే తల వొంచుకొని తిరుగుతున్నాను.

రత్తమ్మ : ఒకరి ఖర్మకు ఇంకోర్నని ఏం లాభం?

వెంక : అంతేలే. చేతగానప్పుడు అంతా వేదాంతమే. (కోటు వేసుకున్నాడు అప్పటికే. గొడుగు పట్టుకుంటూ) వస్తామరి.

రత్తమ్మ : అదేమిటన్నయ్యా, కాఫీ అన్నా తాగిపోవా?...సంబంధం విషయం మళ్లీ ఆలోచించు అన్నయ్యా.

వెంక : ఇదిగో రత్తమ్మా! ఇక ఆ ఆశలు పెట్టుకోకు. ఇన్నాళ్ల నుంచీ మీవదినె అంటుంటే ఏమో అనుకున్నాగాని- ఇక నాకూ ఈ సంబంధం చేసుకోవడం బొత్తిగా ఇష్టంలేదు చెప్పొద్దూ.

రత్తమ్మ : ఇంతలోనే మనసెందుకు మార్చుకున్నావన్నయ్యా ?

వెంక : తల్లిదండ్రులు సంపాదించిన ఆస్తిపాస్తులు లేకపోయినా - ఏదో పంతులుపని చేస్తున్నాడు; ఇవేళ క్కాకపోతే రేపైనా హెడ్మాష్టరవుతాడు; కాస్త కట్టా బట్టకు పర్వాలేదని ఆశపడి నిన్నిచ్చాం. పదేళ్లు పనిచేశాడో లేదో పతు వాతమొకటి కొని తెచ్చుకున్నాడు.

రత్తమ్మ : అలా అనకన్నయ్యా. కావాలని రోగాన్ని కొనెవరు తెచ్చుకుంటారు?

వెంక : అంతే అన్నారంటారేగాని- అత్యాశకు పోయి రాత్రింబవళ్లు కష్టపడితే రోగం రాకేంచేస్తుంది? ఇప్పటికి 4,5 ఏండ్లయిందా? ఏమీ తగ్గేసూచనలు లేకపోగా నానాటికీ బలువవుతున్నవె. పోనీ- మిగతావారి బతుకు చూదామంటే - అదీ అంతకన్నా అధ్వాన్నంగా వుంది. నీకు కట్టుకునేందుకు చీరె లేదు; అమ్మాయి కంతకంటే లేవు; పైగా అది పొరుగువాళ్ల బొంతలు కుట్టి మీకు సాయబడుతున్నదనికూడా విన్నాను. అబ్బాయి కిళ్ళీకొట్లో పనిచేస్తాడు; తమ్ముడు లారీ డ్రైవరు. ఇదంతా మన కుటుంబాలు చేయవలసిన పనేనా?

రత్తమ్మ : అంతకంటే ఇంకా చేసేదేముందన్నయ్యా. ఈ పరిస్థితిని చూసైనా నువ్వు అమ్మాయిని కోడలుగా చేసుకుంటావను కున్నాను. ఒకనాడు నువ్వు మాటకూడా ఇచ్చావు. గుర్తుందా అన్నయ్యా?

వెంక : గుర్తుందమ్మా గుర్తుంది. కాని-ఏం లాభం? ఆనాడు బావా మరదళ్లు కలిసి మెలిసి తిరిగారు. ఇహ వాళ్లిద్దరికీ ఎలాగూ

ముడిపడక తప్పదనుకున్నాను. కాని- కాలం ఇలా మారుతుందని కలగన్నానా?

రత్తమ్మ : కాలం ఎంత మారినా మన బుద్ధులెందుకు మారాలన్నయ్యా ?

వెంక : ఏమిచేయ్- బుద్ధుల నెంచేదాకా వచ్చింది! అవున్లే. కాలం కొద్దీ బుద్ధులు...అయినా-మీ బుద్ధులు మాకెక్కడొస్తాయిలే. మాసంబంధం మీ కెక్కడ కుదురుతుంది ? వేరే సంబంధం చూసుకుంటేనే బాగు. (సరిగ్గా ఈ మాటంటుండగా పళ్ళాలు తోముకొని అక్కడ్నుంచి లోపలికి వెడుతున్న గౌరి చేతి నుంచి పళ్ళెం జారిపడుతుంది. తీసుకొని అమిత విచారంతో వెడుతుంది)

వెంక : అంత వొళ్ళు తెలియని నడక ఏమిటే!

రత్తమ్మ : చూస్తూ చూస్తూ వుండగానే వొళ్ళు తెలియనిదైందా అన్నయ్యా? తోబుట్టువువు నీవే అలా అంటే ఇక మా అవస్థలు చూసేదెవరన్నయ్యా?

వెంక : నువ్వే అన్నావుగా ఎవరికర్మకు వారే కర్తలని?

రత్తమ్మ : అవునన్నయ్యా - మా బతుకు పరిహాసంగానే ఉంది. (కొంగుతో కన్నీరు తుడుచుకుంటుంది)

వెంక : ఇదేం కర్మ - నన్ను కూచోబెట్టి ఈ రోదనపారాయణ మెందుకూ?

రత్తమ్మ : కూచో అన్నయ్యా- కాఫీ తాగివెళ్ళు. (గౌరిని పిలుస్తుంది) గౌరీ! గౌరీ! (గౌరి వస్తుంది) కక్కయ్యింకా పాలు తేలే? (తేలేదని తల వూపి వెడుతుంది)

వెంక : ఏం - తల నొప్పుతుంది? ఈ మధ్య నీకేకి ఘుంటకూడా పోయిందా ఏం?

రత్తమ్మ : మా రాత ఇట్లా వున్నాక నువ్వు నడిపించి ఏం బావుకుంటా వన్నయ్యా?

వెంక : వైగా- ఇదో సేరమూ!...చూడబోతే ఇంకా కాఫీకి ఆలస్య మున్నట్టుంది; ఇంతలో పెదబావగారింట్లో చెప్పన్నా వస్తా. (బయలుదేర్తాడు)

రత్తమ్మ : అట్నుంచటే వెళ్లేవ. తప్పకుండా వచ్చి వెళ్ళు అన్నయ్యా.

వెంక : అంతనమ్మకం లేకపోతే ఎట్లా? ఇదిగో - గొడుగు ఇక్కడే పెట్టి వెడుతున్నా. సరేనా? (వెడతాడు)

రత్తమ్మ : గౌరీ! (గౌరివస్తుంది) నీళ్లు కాగాయా?

గౌరి : (టిక్కమొహంతో కాగాయన్నట్టు తలవూపుతుందేగాని మాట్లాడదు)

రత్తమ్మ : అయ్యో - ఖర్మ! నీ నోరేమైపోయిందే! నేను నీళ్లు కాగాయేమో చూస్తాగాని - నువ్వీహాలు వూడ్చిరా. (రత్తమ్మలోపలికెడుతుంది. గౌరి పొరకతోవచ్చి హాలు వూడుస్తుంది. రామం విడుకున్న బట్టలు లోపలికి తీసుకెడుతుంది. అతని చుట్టలునుట్టుకు మంచంమీద వుంచుతుంది. గొడుగును - అలాగే కుర్చీకి తగిలించి వెళ్లిపోతుంది. గౌరి లోపలికి వెళ్ళగానే నిద్రనుంచి లేచినబాబు కళ్ళునులుముకుంటూ హాల్లోకి వస్తాడు. కుక్కిమంచమ్మీద చుట్టలు కనిపిస్తాయి)

బాబు : చుట్టలున్నాయి, ఓహో - కక్కదొచ్చినట్టున్నాడే!... అమ్మా!

రత్తమ్మ : (లోపల్నుంచే) ఆఁ. ఎందుకురా ? (కొడుకు దగ్గరికి తాను రాదు. గౌరితో "తమ్ముడెందుకో పిలుస్తున్నాడు - వెళ్లమ్మా" అని చెప్పడం వినిపిస్తుంది)

బాబు : (గౌరివచ్చాక) కక్కయ్యొచ్చాడా ఏమిటే ? (గౌరిఅవునన్నట్టు తలవూపి వెడుతుంది. బాబు - అక్క లాగా తలవూపడాన్ని అనుకరిస్తాడు వెక్కిరింపుగా)

బాబు : ఇదేమిటి ఇవేళేమో మూగనోము బట్టావ్రా ? అయితే - ఇవేళ మనం లారీమీద పేటకెళ్లిపోతాం. చలో - పదరా పేటాకూ పోదామూ బంగారూరాజా.... (పాడుకుంటూ వుండగా చప్పున గొడుగు కనిపిస్తుంది. అది కొత్తగొడుగు) ఓహోహో! కక్కయ్య కొత్తగొడుగుకొన్నాడే! ...అమ్మా ! అమ్మా !

రత్తమ్మ : (వచ్చి) అమ్మా ! బొమ్మా ! పొద్దున్నే లేవగానే ఒకటే పిలుస్తున్నా వెందుకురా ?

బాబు : కక్కయ్య కొత్తగొడుగు కొన్నాడే. ఇది నాకిమ్మని కక్కయ్యకు చెప్పవూ ? ఎండలో కొట్టుకు వెళ్లలేక మాడి పోతున్నాను.

రత్తమ్మ : మాడినట్టేవుంది బతుకుగాని — అది కక్కయ్యదికాదు. వెంకట్రావు మామయ్యది.

బాబు : మామయ్యేడే ?

రత్తమ్మ : పెదనాన్నింట్లో చెప్పిరావడానికి వెళ్ళాడు.

బాబు : అయితే — మామయ్యను నేనేఅడగనా ఏమిటి కొత్త గొడుగిమ్మని ?

రత్తమ్మ : అడిగావంటే పిప్పు చిట్లుతుంది — ఎధవొచ్చావు.... ఇంత పొద్దెక్కా లేచేది ?

బాబు : (మూతిముడిచి కాస్త కోపంగా) ఊఁ. రెండో ఆట సినిమా అయ్యేదాకా కొట్టుదగ్గర నువ్వుండు తెలుస్తుంది.

రత్తమ్మ : చాల్లే — మాటలు బాగా నేర్చావుగాని — మొహం కడిగావురా ?.

బాబు : అవునుగదూ. వస్తున్నా వస్తున్నా. (అంటూ లోపలికెడతాడు) నువ్వెట్లా బాగుపడ్తావు నాయినా. (అని రత్తమ్మకూడా లోపలికెళ్ల బోతుండగా పాలగ్లాసుతో రామం వస్తాడు)

రామం : (మాటనందుకొని) ఎవరు వదినా బాగుపడేది ?

రత్తమ్మ : ఇంకెవరు ? నువ్వూ, బాబూ, అంతా.

రామం : సరిపోయింది. ఆ మాటే అనొద్దన్నాను....ఇదిగో పాలు. పొగతాకకుండా తెచ్చాను. వీటికోసం నాచుట్టపీకె ఆరిపోయింది.

రత్తమ్మ : (పాలగ్లాసు తీసుకుంటూ) చుట్టపీకె, చుట్టపీకె! పొద్దస్తమానం నీకు ఇవుంటే చాలు:.

రామం : ఈ నాటికి నాకునచ్చే మాట అన్నావువదినా.
నన్నా నన్నన్నానా — నన్నానా నన్నానా ('ఏం నన్నానా' యో అంటూ రత్తమ్మ వెడుతుంది. రామం అలాగే కొనసాగిస్తాడు. ఆమె అన్నదని ఆగాడు)

నన్నా నన్నన్నానా
చుట్టఅయితే ఏమిరా మరి
బీడిఅయితే ఏమిరా

ఈ పాడుప్రాణికి
చుట్టనే వేతాామురా
నన్నా నన్నన్నానా నన్నానా నన్నానా
నన్నా నన్నన్నానా

(ఇలాపాడుతూ చుట్టవెలిగిస్తాడు) బాబూ! బాబూ! (బాబు రాడు. వెంకట్రావువస్తాడు) ఏం బావా — వెళ్లిపోతున్నావా?

వెంక : వెళ్లడానిక్కాకుంటే మీ ఇంట్లో మకాంచేసి దోచుకోపోడాని కొచ్చాననుకున్నావా?

రామం : సరిపోయింది. అంతకోపమెందుకో? ... (మంచమ్మీది చుట్టొకటి తీసి) చుట్టదమ్ము వేస్తావా బావా?

వెంక : ఛీ ఛీ — నాకసలు పొగవాసనే పడదు.

రామం : అరరే — అయితే నేనిప్పుడే వెలిగించానే మరి?

రత్తమ్మ : (కాఫీతో వస్తుంది) ఇదిగో అన్నయ్యా కాఫీ — ఆలస్యమై పోయింది?

వెంక : ఇంకా కాఫీ ఎక్కడపడుతుందీ? బావగారింట్లో ఫలహారాలూ, కాఫీ అన్నీ అయ్యాయి.

రత్తమ్మ : అదంతా ఎందుకన్నయ్యా ఇప్పుడు. తీసుకో. (లోపల్నించి 'భద్రయ్యా ఎవరక్కడ? కాస్తడాక్టర్ని పిలుస్తారా?' అని కేకవేస్తాడు. రామంతో) ఏమయ్యా—అన్నయ్య కేకేస్తున్నారు. డాక్టర్ని పిల్చుకొస్తావా కాస్త?

రామం : సరిపోయింది. అప్పుడే తెల్లవారిందీ! .... నాకూ కాస్త కాఫీఇస్తే అలాగే వెడతాగా.

రత్తమ్మ : మొహం కడిగావూ ?

రామం : మొహం ! మొహం ! పొద్దున్నే లేవగానే మొహం కడగడమేనా పని ? అయినా — లారీ ఆగగానే చేసినపనేమిటనుకున్నావు ? కడిగేసిన మొహంతోటే ఇలా బయల్దేరాను.

రత్తమ్మ : నీమాటలూనువ్వూ. సరె — లోపలికెళ్ళి తాగు కాఫీ. తర్వాత డాక్టరుగారి దగ్గరికెళ్ళిరా

రామం : అలాగే....నన్నా, నన్నన్నానా, నన్నానా నన్నానా — నన్నానా నన్నాన్నానా. అనుకుంటూ వెడతాడు)

వెంక : (కాఫీ తీసుకుంటూ) ఏమిటే- ఈ ఇంట్లో అందరికీ పిచ్చో జబ్బుందా ఏమిటే?

రత్తమ్మ : అట్లా కనబడుతున్నదా అన్నయ్యా?

వెంక : మరి లేకుంటే మీమరిది వేషమేమిటి చెప్పు? పోనీ- వేషం వరకు అలా వుందనుకుంటే మాటలు! ఇక మర్యాద చూడు; నన్ను చుట్ట తాగమంటున్నాడు. పైగా - పెధవ పాట. ఆపాటకు అర్ధమేమైనావుందీ ?

రత్తమ్మ : ఏదో అలవాటన్నయ్యా,సరదాదాగా పాడుకుంటాడు.

వెంక: ఓరి పిడి సరదా పాడుగాను. ఇంట్లో అన్నకు అంత బలువుగా వుంటే పిడికి సర్దా ఏమిటే!

రత్తమ్మ : బలువో, సులువో- అలవాటైపోయింది. అసలు ఇంటిభారాన్ని సగం అతనే మోస్తున్నాడు.

వెంక : ఏమిటో - ఈ ఇల్లేమిటో, ఈ మనుషులేమిటో, అంతా భయంకరంగా అర్ధంగాకుండా అయోమయంగా వుంది. అటు

ఒక్కసారి మీ బావగారింటికెళ్లి చూశావా- ఎంత ముచ్చటగా వుందో ?

రత్తమ్మ : ఇప్పు డవ్వన్నీ ఎత్తకన్నయ్యా. తమ్ముళ్లు సంపాదించి నన్నాళ్ళూ కలిసివుండి, అనుభవించి, తీరా మూలబడి కష్టా లొచ్చేసరికి వేర్లు పడ్డదాగా పోరాడారు.

వెంక : పాపం- మీ అయన సంపాదనే వారి కుటుంబాన్ని పోషించిందా?

రత్తమ్మ : సరే- ఇక కడుపు చించుకుంటే కాళ్ళమీద బడడమేనా, ఇంకేమైనా వుందా ? మేమీ స్థితిలో ఏది చెప్పినా ఎవరూ నమ్మరు.

వెంక : అద్దంలో కనిపించినట్లు కనిపిస్తుంటే మీరు చెప్పడమెందుకూ? ఇతర్లునమ్మడమెందుకుపోనీలే-నువ్వు చెప్పావద్దు; నేను నమ్మా వద్దుగాని-అసలువిషయం చెప్పడం మరిచేపొయ్యాను, విను.

రత్తమ్మ : ఏమిటది?

వెంక : వెనుకటికి అబ్బాయికి ఈవూరు పిల్లను చేసుకోవాలని ఎందుకు సంకల్పం కలగిందో కలిగింది. భగవంతుడు దానికో రూపాన్నిచ్చాడు.

రత్తమ్మ : మనసు మార్చుకున్నావా అన్నయ్యా?

వెంక : ఆఁ. ఉత్తరం వ్రాసిపంపుదామనుకున్నా గానిఇక అడిగావుగా దాపరిక మెందుకూ? (ఇంతలో వక్కపొడి ఇచ్చి కాఫీకప్పు తీసుకెళ్ళడానికి గౌరివస్తుంది) మీ బావగారి అమ్మాయిని చేసుకోడానికి తాంబూలా లిచ్చుకున్నట్టే. (గౌరిచేతినుంచి వక్కపొడి డబ్బా పడిపోతుంది. కప్పు మాత్రం తీసుకెళ్ళి

పోతుంది. నెమ్మదిగా మిగిలిన వక్క పొడినే రత్తమ్మ అన్న కిస్తుంది) హరి హరీ! ఈ ఇల్లో నరకంలా వుంది. ఇందాక పళ్ళాలు పడేసింది; ఇప్పుడు తాంబూలం పడేసింది. ఏమిటీ పని?

రత్తమ్మ : ఖర్మన్నయ్యా- ఖర్మ. ఎలా జరాగాలో అలా జరుగుతుంది. సరె అన్నయా ఈ ఆశ ఇలా చేశావు! నా పేర నాలుగెకరాలు భూమి రాసిస్తానన్నావు ఆ మధ్య. ఇన్నాళ్ళూ నే నడగలేదు. ఇప్పు అవసరమొచ్చి అడుగుతున్నాను. దానిమాట ఏమంటావు?

వెంక - మీ అవసరాలకు ఇస్తానన్లేదే. నాకిష్టమయి ఇస్తానన్నాను. ఇప్పటికీ అదే మాటంటున్నాను. నా ఇష్టమొచ్చినప్పుడు తప్పకుండా ఇస్తాను. దానికి నువ్వు అడగడం, నేను ఇవ్వడం- ఇదంతా అనవసరం.

రత్తమ్మ : సరె అన్నయ్యా- నీ ఇష్టమొచ్చినట్టే కానీ.

వెంక : వస్తామరి. బావకూ, పిల్లలకూ చెప్పు. (గొడుగు పట్టుకొని వెళ్ళిపోతాడు. రత్తమ్మ బయటివరకు సాగనంపి కాసేపు అలాగే చూసి లోపలికి మళ్ళుతుంది. కళ్ళల్లో నీళ్ళు నిండుతాయి. ఇంతలో రామం లోపలినుంచి వస్తాడు)

రామం : దేనికమ్మా ఏడుస్తున్నావు?

రత్తమ్మ : అఁ, (కళ్ళు తుడుచుకుంటూ) ఏం లేదు. డాక్టర్ దగ్గరి కెళ్ళావూ?

రామం : మళ్ళీ ఇందులో దాపిరికా లేమిటో? గౌరిని తన పిల్లవానికి చేసుకోనన్నాడు బావ. అంతేనా?

రత్తమ్మ: అంతే, నీకు తెలియని దేముందీ?

రామం: ఎన్నిటికని ఏడుస్తావమ్మా నీ పిచ్చిగాని.

రత్తమ్మ: నీకేం తెలుసు రామం. ఆ పిల్లను చూస్తుంటే గుండెల మీద కుంపటిలా వుంది.

రామం: అట్లా ఆలోచిస్తే అట్లాగే వుంటుంది మరి,

అట్ల అనుకుంటేమిరా మరి
ఇట్ల అనుకుంటేమిరా
ఈ చిత్రజగతిని
ఎట్ల అనుకున్నొకటెరా
నన్నా నన్నన్నానా నన్నానా నన్నానా
నన్నా నన్న న్నానా
(చుట్ట వెలిగించుకొని బయటికి పోతాడు)

రత్తమ్మ: నన్నా నన్నా, హయ్యో రాత. నీదో పిచ్చి, ఎట్లా బాగు పడ్తావో, ఏమో.

బాబు: (వచ్చి) ఎవరే?

రత్తమ్మ: ఎవరేమిటిరా?

బాబు: ఎవరో బాగుపడమని అంటుంటే. ఇందాక నన్నన్నావు ఇప్పుడింకెవర్నంటున్నావు?

రత్తమ్మ: ఇంకెవరినో ఎందుకంటాను? మీ కక్కయ్యను.

బాబు: కక్కయ్యకేమే. లారీమీద డ్రైవర్. నా సామిరంగా- అవనే నా కుంటేనా-మిమ్ములందర్నీ అందులోవేసి అన్నాళ్లూ తిప్పక పొయ్యానూ? .... అమ్మా! కెల్లీకొట్టు మానేసి ఒక చిన్నలారీకొంటె ఏమే?

రత్తమ్మ : బాగానేవుంది. కోర్కెలు గుర్రాన్నెక్కితే ఖర్మగాడిదలను కాసిందట. అలావుంది మనబతుకు. మింగడానికి మెతుకు, చదవడానికి డబ్బులేదటగాని - లాఠీ కొంటానడట పిలగాడు లాఠీ.

బాబు : ఏమైనాసరే ఈ ఏడుచదివి తీరాల్సిందేనే. నాతోడివాళ్లంతా బడికెడుతున్నారు. నేనెప్పుడు వెళ్ళాలమ్మా. పొద్దస్తమానం కిళ్ళీకొట్లో కూచోవాలంటే ఏం బాగుండలేదే.

రత్తమ్మ : అన్నీబాగుండే చేస్తున్నామా బాబూ! మనఖర్మ కొద్దీ చేస్తూన్నాం.

బాబు : అమ్మా! మాటమాటకు కర్మంటావు. అంటే ఏమిటే ?

రత్తమ్మ : పోవెధవ, నీకు పనీపాటా ఏమీలేనట్టుంది. అడ్డదిడ్డమైన ప్రశ్నలన్నీ వేస్తుంటావు....ఇంకా కొట్టుకు బయలుదేరలేదేం?

బాబు : ఇవేళ ఆదివారం. మర్చిపోయావా ఏం ? పగిలు కొట్లులేవు. ఒక రాత్రికి సినిమా మొదలుపెట్టాక చూశాం. ఇవేళ దాని కూర్కడా పోను.

రత్తమ్మ : కొట్టులేదని నన్ను వేధిస్తున్నావా ? ఏదో పని చేసుకో పో.

బాబు : కక్కయ్యేడే ?

రత్తమ్మ : డాక్టర్ గార్ని పిల్చుకోరావడానికి వెళ్ళాడు.

బాబు : మామయ్య గొడుగు తీసుకొని వెళ్ళినట్టున్నాడే ?

రత్తమ్మ : వెళ్ళక వుంటాడనుకున్నావా ?

బాబు : గొడుగు అడక్కపోయావె నాకక్కావాలని.

పత్రమ్మ : ఇస్తానన్నాడు ఇచ్చాడా; ఇక - ఇమ్మడిగితే ఇస్తాడు, ఏదో మనఖర్మ.

బాబు : ఏం కర్మేమిటో, ఏం ఖర్మేమిటో. సరె - బయటకెళ్ళి కక్కయ్యొత్తా వస్తాను. (వెళతాడు)

పత్రమ్మ : పిచ్చినాన్న. నాకడుపున పుట్టినందుకు నీ కెన్ని కష్టాలొచ్చాయేరా? (గౌరివచ్చి పక్కపొడి డబ్బా తీసుకొని పోతుంటుంది) గౌరీ - ఇలా రామ్మా (గౌరి తల్లిదగ్గర కెడుతుంది) ఏమిటితల్లీ — అప్పట్నుంచీ మాట్లాడడమే లేదు. (సమాధానం ఇవ్వకుండా వెళ్ళబోతుంది) అమ్మా - గౌరీ! ఇటురా తల్లీ. (మళ్ళీ తల్లిదగ్గరికెడుతుంది) ఎందుకు తల్లీ అంతకోపం? ఎందుకలా మూగనోము పట్టావు? చెప్పు తల్లీ - చెప్పు. చెప్పకుంటే నా మీద ఒట్టే. (కూతురు గభాల్న తల్లి భుజాలపై బడి ఏడుస్తుందేగాని చెప్పదు) వద్దుతల్లీ, (ఓదారుస్తూ) ఏడవకు. నీకెందుకిలా అయ్యావో నా కర్మమేంటో తల్లీ. కాని - అలా మూగనోము పడితే ఎలా తల్లీ. ఉన్న ఒక్క బిడ్డవూ మాట్లాడకుంటే నా కడుపు తరుక్కుపోదూ? ఈ కష్టాలు కలకాలం ఉంటాయా తల్లీ. దిగులు పెట్టుకోకమ్మ ఈ వయస్సులోనే ఇంతదిగులా తల్లీ. ఇదంతా నాఖర్మ. నా కడుపున పుట్టినందుకు మీరు అనుభవిస్తున్నారు. పాలమ్మ - పని చేసుకుందాం పా. (ఇద్దరూ లోపలికెడతారు. కాసేపటికి [illegible] రాముం, బాబు వస్తారు)

రాముం : [illegible]

[illegible]....

వదినే డాక్టరుగారూ వచ్చారూ
చూడమ్మా - నన్నా నన్నన్నానా

డాక్టర్ : చాలుగాని - వెళ్ళి అన్నగార్ని ఇక్కడికి తీసుకురా. [illegible] లు తుతుంది.

రామం : మంచిది. రాధాబాబూ! (ఇద్దరూ వెడతారు, [illegible] సంచి అక్కడ బల్లమీదపుంచి చూస్తుంటాడు. రత్తమ్మ వస్తుంది)

రత్తమ్మ : వచ్చారా డాక్టరుగారూ! అప్పట్నుంచీ చాలా ఆయాస పడుతున్నారు.

డాక్టర్ : అం హాఁ. వారు అవీ ఇవీ మనసులో పెట్టుకోని ఆరాట పడకుంటే బాగుండేది. అయినా - మనం అనుకోవడంగాని - ఆ ఆ రాటాన్ని ఎలా తీసేస్తాం లెండి. సరె - నుంచ్చొను. (నుంచమ్మిది చుట్టలపై దృష్టి పడుతుంది) ఈ చుట్టలెక్కడివి? (ఒకటి తీస్తాడు)

రత్తమ్మ : మావరిదికి ఆ దురలవాటుంది.

డాక్టర్ : అలవాటనండి. మంచి అలవాటు, చెడు అలవాటని నిశ్చయిం చడం కష్టం. ఒకరికి మంచి అలవాటు, మరొకరికి దురల వాటు.

రత్తమ్మ : సరె- చదువుకున్నవారికి నేనేం చెప్పగలను?

డాక్టర్ : అదికాదండీ, ఏ అలవాటెందు కపుతుందో. [illegible] సాను భూతితో ఆలోచిస్తే దాన్ని మనం ఇంత భయంకరంగా అను కోము. (అని తానో చుట్ట వెలిగిస్తాడు)

రత్తమ్మ : ఏ మాలోచనో- ఒకటే ఆలోచన. ఇప్పుడే వస్తా. (లోపలి కెడుతుంది. రామం. బాబులు భద్రయ్యను నెమ్మదిగా తీసుకొస్తారు. పడకకుర్చీలో కూర్చోపెడతారు. రామం - డాక్టర్ చుట్ట కాల్చడం చూసి నవ్వి, మంచమ్మీది చుట్టలు నిక్కరు జేబులో వేసుకుంటాడు)

భద్రయ్య : హమ్మయ్య- మీరంతా వెళ్ళండి. (భద్రయ్య, డాక్టరు తప్ప అంతా వెళతారు) డాక్టర్ గారూ! నన్నింత తిప్పలు పెట్టేకంటే ఒక్క గోలీ ఇవ్వకూడదూ?

డాక్టర్ : ఏ గోలీ అండీ.

భద్రయ్య : వైకుంఠానికెళ్ళే గోలీ. మంట్లో వైకుంఠం. నా కర్మకు వైకుంఠం కూడానా. నరకమే గతి. అంతేనా డాక్టరుగారూ?

డాక్టర్ : మీకు నరకమేమిటండీ- ఎవరి కపకారం చేశారని?

భద్రయ్య : మనకెలా తెలుస్తుందండీ. అయినా ఈ జన్మలో కాకుంటే గత జన్మలేమో? అప్పుడు తప్పుడు పనులుచేసి వుంటాను, అనుభవిస్తున్నాను.

డాక్టర్ : భద్రయ్యగారూ! మీరా ఆలోచనలన్నీ పెట్టుకోకుండావుంటే బాగు.

భద్రయ్య : అలాగే చేస్తా డాక్టరుగారూ! ఒక్క గోలీ ఇవ్వండి. ఒక్కటంటే ఒక్క గోలీ. ఆగోలీ ఎందుకివ్వరూ అంటాను.

డాక్టర్ : ఎప్పుడు ఏ గోలీ ఇవ్వాలో కాస్త నన్ను నిర్ణయించుకోనివ్వండి. భద్రయ్యగారూ.

భద్రయ్య : హాయ్యో! రామా, నాబాధ మీకే మర్థమవుతుందండీ. అర్థమైతే ఇలా అనరు. తప్పకుండా ఇస్తారు గోలీ.

డాక్టర్ : నాకు అర్థమైందాన్ని బట్టి ఎప్పుడే గోలీ ఇవ్వాలో అదిస్తాను. సరేనా ?

భద్రయ్య : ఇక లాభం లేదండీ. ఎలాగైనా ఎప్పుడో అప్పుడు మీరు ఇచ్చి తీరాల్సే వుంటుంది. తప్పదు.

డాక్టర్ : అలా గేలెండి గాని- కాస్త నాలుక చాచండి. (నాలుక చూస్తే థర్మామీటరు వుంచుతాడు. చేతి గడియారం కాసేపు చూసి థర్మామీటరు తీసి జ్వరం చూస్తాడు- అవతలకు తిరిగి బాబూ ! (బాబు వస్తాడు)

డాక్టర్ : కాసిని నీళ్లు తేఅబ్బాయ్. (బాబు వెళతాడు)

భద్రయ్య : జ్వరముందా డాక్టరుగారూ!

డాక్టర్ : ఏమీ లేదుగాని- మీరేమీ ఆరాటపడకూడదు.

భద్రయ్య : మీరు చెప్పరుగాని- జ్వరముండకుండా లేదండీ!

డాక్టర్ : మీ అనుమానమే సగం జబ్బు. జ్వరం ఇదివరకుండేమోగాని- ఇప్పుడైతే లేదు.

భద్రయ్య : రాత్రంతా నిద్ర లేదండీ. నోటు రక్తమైపోతుంది.

డాక్టర్ : మరి మీకు ఎన్నిసార్లు చెప్పాను లేనిపోని దిగుళ్లు పెట్టుకో కూడదు, ఉద్రేకపడకూడదూ అని. అలా అయితేనే మందు క్షేమైనా పనిచేస్తాయి.

భద్రయ్య: దిగుళ్ళు పెట్టుకోకూడదు ఉద్రేకపడకూడదు; దిగుళ్లు పెట్టుకోకూడదు. ఉద్రేకపడకూడదు. (అంతలో బాబు గ్లాసుతో నీళ్లు తెస్తాడు) ఏం చేస్తున్నాడో తెలుసా డాక్టరుగారూ !

డాక్టర్ : (థర్మామీటర్ కడుగుతూ) తెలుసండి.

భద్రయ్య : మీకు తెలియదు. వినండి! వాడు కిల్లీకొట్లో కూచుంటున్నాడు; రాత్రింబవళ్ళు కూచుంటున్నాడు ఎవరి కోసం కూచుంటున్నాడు? నాకోసం. నా పోషణకోసం. ఈ కొడున్నే ఏడీ పని చేయడం తగునంటారా డాక్టరుగారూ! ...మాట్లాడరేం? (బాబు వెళ్ళిపోతాడు)

డాక్టర్ : ఎలా అంటాను? కాని - భద్రయ్యగారూ? ఇదంతా నాకు తెలుసు.

భద్రయ్య : మీకింకా పూర్తిగా తెలియదు. వాడిమీద నేనెన్ని ఆశలు పెట్టుకున్నానో మీకు తెలియదు. వాడు చదువుతానంటే వరకూ చదివింతా మనుకున్నాను. కలెక్టరు ఉద్యోగమొచ్చే చదువు చదివింతా మనుకున్నాను. వాడి ఆరోగ్యాని కవసరమైన ఆహారమూ దుస్తులూ చేకూర్చుదామనుకున్నాము

డాక్టర్ : అంత పెద్ద కోర్కెలను గూర్చి ఎందుకాలోచించారండీ అప్పుడే?

భద్రయ్య: నేను తప్పుగా ఆలోచించానా డాక్టరుగారూ? వాడితండ్రిగా ఆలోచించాను; అది నా విధిగా ఆలోచించాను. కాని ఏం లాభం? పస్తుఫారంతోటే వాడి చదువు చట్టుబండలు కావల్సి వచ్చింది. ఈ విధంగా ఎందుకైంది డాక్టరుగారూ! .... మాట్లాడరేం. నావల్ల అయింది... నిజమా? కాదా?

డాక్టర్ : బాగుంది. మీరేం చేసారు. మీ ఆరోగ్యం చక్కగా వుంటే అనుకున్నట్టే చేసేవారు మరి.

భద్రయ్య : చెయ్యలేనప్పుడు బ్రతకడం ఎందుకూ అంటాను? అందుకే ఒక్క గోలీ ఇమ్మంటే ఇవ్వరు మీరు. ఎంత సేపూ సెలవుమంటారు తో

మీరుగాని- నాక్కావల్సిన మందు ఇవ్వరుగదా. మిమ్మల్నడగేది ఒక్కగోలీ అండీ. ఒక్కటంటే ఒక్కటి...హాయేర్యారాము. చెమటలు పోస్తున్నాయి.

డాక్టర్ : నేను చెప్పలే- మీరు అనవసరంగా హైరాను పడ్తారు.

భద్రయ్య : ఏం హైరాను డాక్టరుగారూ! నా బాధ మీకర్థం కాదు .... అమ్మా- గౌరీ! (గౌరి వస్తుంది) చెమటలు పోస్తున్నాయి. విసనకర్ర తేతల్లీ. (వెడుతుంది) దీని సంగతి మీకు తెలుసా డాక్టరుగారూ?

డాక్టర్ : నాకు అందరి సంగతులూ తెల్సుగాని- అనవసరంగా మీరు. ఆవేదన పడి అలసిపోతున్నారు. (గౌరి- వంటింట్లో పొయ్యి విసిరే ఊడిపోయిన వెదురు విసనకర్ర తెస్తుంది)

భద్రయ్య : వెధవ విసనకర్ర. ఇదెందుకే తాటాకు విసనకర్ర తే. (మళ్ళీ వెడుతుంది.) లేదుకాబోలు. హరిహరీ! తాటాకు విసనకర్రయినా లేదు కొంపలో.

డాక్టర్ : లేనిదానికి దిగులెందుకండీ. ఉన్నదాంతో పని వెళ్ళదీసుకోవాలి గాని. (గౌరి వస్తుంది)

భద్రయ్య : ఏమే-లేదుగా, అమ్మనడిగావు. అది చెప్పిస్తానని వుంటుంది. అంతేనా?....మాట్లాడవేమే?

డాక్టర్ : ఇంకా రెట్టించడమెందుకూ? ప్రస్తుతం లేదు-కాబోలు. (గౌరి వెళ్ళిపోతుంది.)

భద్రయ్య : ఏది వుందని ఇది లేదనుకోటానికి. ఏదీ లేదు ఈ కొంపలో. నాకు కాళ్ళు చేతులూ ఆడినన్నాళ్ళూ వున్నాయి అన్నీ. ... అమ్మా- గౌరీ! (వస్తుంది) అదేమిటే- అప్పుడే వెళ్ళిపోయావ్?

విసురు తల్లీ విసురు...అమ్మ ఏం చేస్తున్నదే? (గౌరి మాట్లాడదు. మాట్లాడకుండా విసరడం ప్రారంభిస్తుంది) కాఫీ చేస్తున్నదా? మాట్లాడవేం తల్లీ. నూగనోము పట్టావెందుకమ్మా? నీకు ఆసంబంధం కాకపోతే మరో మంచి సంబంధం చూతాం (విసనకర్ర అక్కడ పడేసి వెళ్లిపోతుంది) హరిహరీ. ఏమిచేశా పని?

డాక్టర్: భద్రయ్యగారూ! మీరు క్షణక్షణం అలాదిగులు పడిపోతేఎలా?

సత్తెమ్మ: (కాఫీ కప్పుతో వచ్చి) అలా చెప్పండి డాక్టరుగారూ! ప్రతిదిదిగులే, ప్రతిదీ అనుమానమే అర్థరాత్రి లేస్తారు. కళ్లు ఎర్రబడ్డాయో, పచ్చబడ్డాయో చూడమంటారు; గుండె ఆడుతున్నదో, లేదో చూడమంటారు. ఇలా ప్రతిక్షణం అనుమాన పడుతూ వారు నిద్రపోరు, మమ్ముల పోనివ్వరు.

భద్రయ్య: అవును నేను నిద్రపోను; మిమ్ముల పోనివ్వను. అందుకే నాకో గోలి ఇమ్మంటే ఇవ్వరు మీరు. ఇదేం అన్యాయముండీ డాక్టరుగారూ! ఎంతసేపూ మీమందే మీరుగాని-నాక్కావల్సిన మందివ్వరుగదా మీ రోక్క గోలీ ఇస్తే నేను శాశ్వతంగా కన్ను మూసేవాణ్ణి; వీళ్లు హాయిగా కమ్మటి కలలు గంటూ నిద్రపోయ్యే వాళ్లు.

సత్తెమ్మ: ఇదీ వరుస. అలా అంటే ఇలా అంటారు. మేము హాయిగా నిద్ర పోవాలని అనుకుంటే ఇన్నేండ్లనుంచి ఇలా వుంటామా డాక్టరు గారూ! కష్టమో, సుఖమో కలసి వుండ డానికేగా?.. మీరు ఆయన మాటలు పట్టించు కోకండి డాక్టరు గారూ!.... అదిగో కాఫీ చల్లారుతున్నది. తీసుకోండి. (భర్తకు విసురుతూ నుంచుంటుంది.)

డాక్టర్: (కాఫీ తీసుకుంటూ) రత్తమ్మగారూ! ఈ అలవాటుకు కూడా అంతుండాలి. నేనొచ్చినప్పుడల్లా మీరిలా శ్రమ పడడం నాకెంత మాత్రం ఇష్టం లేదు. నేనిప్పుడే కాఫీతీసుకొని బయలు దేరాను.

రత్త: తీసుకొని రాలేదమూ ఇంటికి కాఫీకొస్తారనా? మీకు పెట్టి మర్యాద లేమీ చేయలేక పోయినా-చేతనైందయినా చేయ నివ్వండి.

డాక్టర్: మీరలా అనుకోనే వద్దు. అంతగా అవసరమైతే నేనే అడిగి కాఫీ చేయించు కుంటాను. సరేనా! నా కామాత్రం చనువు ఈ ఇంట్లో వుందని తెలుసు.

రత్త: ఏదో మీ దయవల్ల ఇంత శ్రద్ధ తీసుకుంటున్నారు.

భద్రయ్య: ఇన్నాళ్లూ మిమ్ముల నేను ఒక్క డాక్టరుగానే భావించలేదు. ఆప్తులుగా భావించి-అన్ని వాగుడుల్లో వాగేస్తున్నాను.

డాక్టర్: ఏమిటండీ ఆమాట. మీరలా చెప్పింది వినడానికి నాకే అభ్యంతరమూ లేదు. కాని-అనవసరంగా ఆందోళన పడవద్దంటాను. అంతే.

భద్రయ్య: పాండిత్యారామ. ఆందోళన పడ్తుంటారు. ఆందోళన కాక ఇంకేంమిగిలిందండీ. (భార్య కేసి చూసి) దీని సంగతి మీకు తెలుసా డాక్టరు గారూ?

రత్త: వారి కంతా తెలుసు. మళ్లీ మళ్లీ మీరు చెప్పడం ఎందుకూ?

భద్రయ్య: వారికి అంతా తెలియదు. వినండి డాక్టరు గారూ! ఎన్ని సంబంధాలు వచ్చినా కాదని నాకొక్క రాయి మొహాన్ని చావి బరు గాలి కోరుకుంది. పిరాకు వెనుక సెంటు భూమి

గానీ, వేరే ఆస్తి పాస్తులు గానీ ఏమీలేవు. ఒకే ఒకకొంప మాత్రమే మా ఆస్తి. పైగా-అప్పటికి అయిదుగురు అన్నదమ్ములం. తర్వాత ఇద్దరు పోయ్యారు. అయితే నాకు పెళ్లి కావడానికున్న అర్హతల్లా పొట్టలో నాలుగక్షరాలు. ఆ అక్షరాలను నమ్ముకొని పెద్ద కుటుంబంలో పుట్టిన ఇది నా కొక్కరాయి మొహాన్ని ఎన్నుకొంది.

రత్తమ్మ: బాగానేవుంది. రానురాను మరీ చిన్నపిల్లలై పోతున్నారు;

భద్రయ్య: ఏభయ్యోవడిలో పడుతుంటే ఇంకా సిగ్గెందుకే నీ మొహం. అంత ఆశతో పెళ్ళిచేసుకున్న దీనికి నేను కంటెలు, కాసులు ఏమీ చేయించలేక పోయ్యాను; ఒక పట్టు చీరె కొనలేక పోయ్యాను; పైగా పుట్టింటివారు దానికి పెట్టిన నగలన్నీ అమ్మించాను.

రత్తమ్మ: బాగుంది. మీరు కాస్తో కూస్తో వెనకేసిన వన్నీ అయిపోతే- ఈ జబ్బుకు. అలాగే నా నగలు. అయినా-కంటెలు, కాసుల కోసమేనా పెళ్ళి చేసుకునేది. అవయినా ఉంటే పెడతారు. లేంకుంటే లేదు.

భద్రయ్య: అది కాదే. ప్రతి ఆడదీ-తన తోటి ఆడవాళ్ళ లాగా వుండా లని కోరదే?

రత్తమ్మ: కోర్కెలకేం. మహారాణిలా బతకాలని వుంటుంది. ఎందుకా వల్లమాలిన కోరికలు?

భద్రయ్య: అదిగో చూశారా ఉంటాయి ఆ కోర్కెలు. నేను చెప్పలా.

డాక్టర్: భద్రయ్యగారూ! మీకున్న దిగులేగాక-వారు పడే దిగులు కూడా మీరే పడేట్టున్నారే.

రత్తమ్మ: వేరే పనేమీ చేతగాక పోవడంతో పూరికే కూచొని ఇవే ఆలోచనలు. పిచ్చి పిచ్చిగా ఆలోచిస్తారు. ఒకొక్కొక్కప్పుడు మరీ భయంకరంగా ఆలోచిస్తుంటారు. పిల్లల గతేమిటని ఒకటే ఆందోళన.

డాక్టర్: అదే వద్దని కోరేది. ఎలా జరగాలో అలా జరుగుతుంటె. మీరా ఆలోచనలన్నీ మానేస్తేగాని కుదరదు.

భద్రయ్య: ఈ జబ్బు కుదిరితేగాని ఆ ఆలోచనలు పోవని అనరే. ఎందు కంటూరా మాట? పిచ్చి కుదిరితేగాని పెళ్ళి కాదు; పెళ్ళ యితే గాని పిచ్చి కుదరదు. అందుకే ఒక్క గోలీ పడెయ్యా మంటే పడెయ్యరు మీరు. ఎంత ఆప్యాయమండీ డాక్టరు గారూ! ఎంత సేస్పూ మీ మందే మీరు గాని- నాకాక్కావల్సిన మందివ్వరు గదా.

డాక్టర్ : పదేపదే ఎందుకు మీరా మాట అనడం ? ఎప్పుడు ఏగోలీ కావాలో నే నెలాగ్గా ఇస్తానన్నాగా. అనవసరంగా ఉద్రేక పడకండి... సరె - మళ్లీ వస్తాను. (వెళ్లబోతాడు)

రత్తమ్మ : ఎందుకనో ఈవేళ మరీ ఆరాట పడుతున్నారు. దయవుంచి మీరు నాలుగుసార్లు చూస్తేగాని లాభంలేదు.

డాక్టర్ : అలాగే పిలున్నన్నిసార్లు వస్తాను. మీరు ఎవర్నీ పంపక్క ర్లేదు. తప్పకుండా వస్తాను. భద్రయ్యగారంత ఆప్తులు నాకులేరు. సరేనా ?

భద్రయ్య : ఏం ఆప్తుణ్ణో — మీరో గోలీ ఇమ్మంటే ఇవ్వరు.

డాక్టర్ : (ఒకమాత్ర రత్తమ్మకిస్తూ భద్రయ్యతో) ముందు ఈ మాత్ర వేసుకోండి. హైరాను పడకండి...రత్తమ్మగారూ ! ఈ బి యివ్వండి... వస్తానుమరి. (వెడతాడు)

భద్రయ్య : హరిహరీ. ఈ చేదు మాత్రలు మింగలేక నా ప్రాణాలు పోతున్నాయి. ఈ మాత్రకు అనుపానంగా పంచదార, బెల్లాలు అక్కర్లేదు; పోనీ ఉప్పన్నా తేవే. పుల్లపుల్లగా వుంటుంది.

రత్తమ్మ : హమ్మ యొ్యా – ఉప్పే! ఎలాగో కళ్లుమూసుకొని మింగండీ.

భద్రయ్య: కళ్ళుమూసుకొని మింగండి; కళ్ళుమూసుకొని మింగండి. ఇంకానయం. పూర్తిగా కళ్ళుమూసుకో మన్లేదు ... తే నీళ్ళు తే. బతికి సన్నాళ్ళూ అన్ని కష్టాలు మింగినట్టు చేదూ మింగాలి; అవసరమైతే విషమూ మింగాలి ... నీళ్లన్నా తే. (రత్తమ్మ లోపలికెడుతుంది.) భద్రయ్య మాత్ర చేతిలో వుంచుకొని) ఇందులో వేపాకురసం నింపావురా భగవంతుడా. (నీళ్ళుతెస్తుంది) రత్నం! ఈ పూట ఈ బిళ్ల మింగకపోతే ఏమే. రాత్రొకటి మింగాగా. అది పనిచేయదూ !

రత్తమ్మ : అలాఅంటే ఎలాగండీ. ఎన్ని బిళ్లలు మింగాలో ఏమిటో.

భద్రయ్య:ఏమైనా కానీ.ఇక ఈ బిళ్లలు అసలే మింగను.జన్మంతా బిళ్లలు మింగడం, సూదులు తీసుకోవడమేనా ? చిన్నప్పుడు సాము గరిడీలు చేశానే – వజ్రకాయ మనుకునేవాణ్ణి. ఏమై పోయిందే అవోళ్లంతా. పైగా ఆరోగ్యానికని కొన్నాళ్ళు బాదంపప్పుకూడా తిన్నాను. ఇలా అవుతుందని తెలిస్తే అనవసరంగా ఆఖర్చు చేసేవాణ్ణటే. ఆ చాదస్తమే పోయింది. నా చిన్నప్పుడు కాయితం బ్రాహ్మడు జాతకంచూచి నాకు 80 పండ్ల ఆయుస్సుంటుందన్నాడు. ముప్పయ్యో ఏటినుంచి ఏదో సంపద తోసుకొస్తుందన్నాడు. అదంతా ఏదే !

రత్తమ్మ : జాతకాలన్నీ నిజమవుతాయటండీ — మీదో పెర్రిగాని ?

భద్రయ్య: అవున్లే జాతకానికి 'అయితే కావచ్చు, కాకపోతే కాక పోవచ్చు' అనే శాపముందట. నాది కాక పోవచ్చు జాతకమన్న మాట. అయినా-దండాలు, బస్కీలుతీస్తే శరీరం బాగుంటుందంటారు. ఈ జబ్బొచ్చేదాకా శీర్షాసనంక్రమం తప్పకుండా వేశాగదే. పైగా—బళ్లో పిల్లలందరికి వ్యాయామ మవసరమని చెప్పాను. నేర్చుకోని వాళ్లను కోప్పడ్డాను. కొట్టానుకూడాను. ఇప్పుడువాళ్ళు నాపరిస్థితిచూచి నవ్వుతారుకదూ?

రత్తమ్మ : అయ్యో ఖర్మ. ఏవేవో ఆలోచిస్తూ తెగహైరాను పడ్తారెందుకండీ. ముందీ మాత్రమింగండి.

భద్రయ్య: నాకు చేదు మింగిస్తావశే. బాగున్నప్పుడు రోజూ నీ కోసం మిఠాయీలు తేలేదశే? మనగౌరి కడుపులో వుండగా నీకు ఎన్ని రకాల మిఠాయిలు తెచ్చాను చెప్పు.

రత్తమ్మ : ఎలా చావనండీ మీతో, ఇదిగో-ఈ మాత్ర మింగితే మళ్ళీ మిఠాయీలూ తేవచ్చు; నగలూ నాణాలూ తేవచ్చు, సరేనా ?

భద్రయ్య: నామీద ఒట్టేసి చెప్పు-నిజంగా మళ్ళీనేను మనిషినవుతాననే నమ్మకం నీకు వుందశే. ఈ ఆశ పెట్టబట్టి ఎన్నేళ్లయింది చెప్పు ? ఈ జబ్బు వచ్చినప్పటినుంచి అంటున్నావు. అవునా- అలా చెబుతూ చెబుతూ నన్ను ఆశపెట్టి ఎన్ని వేల మాత్రలు మింగించావో, ఎన్ని సూదుమందు లిప్పించావో గుర్తుందా?

రత్తమ్మ : అలాగే కాస్త ఇదికూడా మింగండి. తప్పకుండా నయమవుతుంది.

భద్రయ్య : ఏమిటో — నీ ఆశేగాని నాకా ఆశలేదు. ఏదో నీవు చెబుతుందబట్టి మింగుతున్నా. నోటిదగ్గరకు పోనిచ్చి వద్దులేవే— ఈవేళ మాత్రిలేకుంటే ఏం ?

రత్తమ్మ : బాగానేవుంది ఈ జాగు. తొందరగా మింగండి. నాకింకా తల బోలెడు పనుంది.

భద్రయ్య : అవును. అందరికీ అన్ని పనులున్నాయి. ఈ ఇంట్లో పని లేనివాణ్ణి నేనొక్కణ్ణే. నువ్వు ఇంటి చాకిరంతా చెస్తావు; అమ్మాయి పొద్దస్తమానం పొరుగువాళ్ళ బట్టలు కుడుతుంది. అది మాత్రం అతుకుల బొంతలు కడుతుంది; అబ్బాయి కిళ్లీ కొట్లో నిద్రకాస్తాడు: తమ్ముడు లారీలు తోల్తాడు. హోరి భగవంతుడా ! ఎలా చేశావేరా తండ్రి.

రత్తమ్మ : మాటిమాటికీ ఇలా అనుకోగానే ఈ కష్టాలు పోతాయటండీ...ముందీమాత్రం మింగండీ.

భద్రయ్య: తే. బతికినన్నాళ్ళూ మింగకతప్పుతుందీ, (నోట్లో వేసుకొని, నీళ్లు తాగి మొహమంతా చిట్లించి) ఓరి రామయ్య తండ్రీ- నేనెవరినేం కష్టపెట్టానయ్యా? వేలమందికి చదువులు చెప్పాను; వందలమందికి ప్రోనోట్లు వ్రాశాను: అడిగినవారికల్లా తోచినంత దానం చేశాను; ఎంతోమంది పెళ్లిళ్ళకు తోడ్పడ్డాను. ప్రతిరోజూ నీ పూజ చేసుకుంటున్నాను. నువ్వు నా సంగతే మరిచిపొయ్యావు మహానుభావా! ...చెమటలు పోస్తున్నాయే రత్నం.

రత్తమ్మ : కాస్త లోపల మంచంమ్మీద పడుకోండి.

భద్రయ్య : పద అక్కడే పడుంటాను.

రత్తమ్మ : కానేపు నిద్రపోండి. (లేపి లోపలికి తీసుకెళుతుంది. విసన కర్రకూడా వెంట తీసుకెళుతుంది. ఇంతలో దూరంనుంచి భిక్షుకుడిపాట వినిపిస్తూ ఈ ఇంటికి దగ్గరవుతుంది. రత్తమ్మ కన్నీరు తుడుచుకుంటూ హాలులోకి కొచ్చి ఈపాట బయట జరుగుతున్నంత సేపూ- అక్కడ తగిలించబడ్డ ఫొటోలను చూసి విచారపడుతుంటుంది. అందులో చాలావరకూ భద్రయ్య మంచిగా వున్నప్పుడు దిగిన ఫొటోలు ఇలా దిగులుపడు తుండగా భిక్షుకుడు 'అమ్మా ధర్మం తల్లీ' అని కేక వేస్తాడు. దాంతో రత్తమ్మ ధ్యాసలో కొస్తుంది, చప్పున ఇంట్లో కెళ్లి పిడికెడు గింజలు తెచ్చి వేసి తిరిగి ఇంట్లో కెళుతుండగా బయటినుంచి బాబు వెక్కి వెక్కి ఏడుస్తూ వస్తాడు. భిక్షుకుడి పాట హఠాత్తుగా ఆగక మరో ఇంటికి వెళుతున్నట్టు నెమ్మదిగా తగ్గిపోతుంది)

రత్తమ్మ : ఏమిట్రా ఏడుస్తున్నావు?

బాబు : మన ఎర్రమేడ కనకారావుగారు లేరూ?

రత్తమ్మ : అవును.

బాబు : వాళ్లింట్లో గ్రామఫోను పెడితే విందామని గడపలోకెళ్లాను. ఆయన కొడుకు లేడూ - వీరరాఘవులు. వాడేమన్నాడో తెలుసా ?

రత్తమ్మ : అదే చెప్పునాయినా.

బాబు : చదువురాని మొద్దువు. నీకా పాటలు అర్థంకావులే. వెళ్లు వెళ్లు, దున్నపోతుల కాసుకో పొమ్మని నెట్టేసి తలుపు మూసేసుకున్నాడు.

రత్తమ్మ : ఎవళ్ళో, ఏదో అన్నారని అలా ఏడుస్తారా బాబూ (కొడుకు నెత్తుకొని కళ్ళు తుడుస్తూ) ఎవరికొచ్చిన చదువు వాళ్ళ కొస్తుంది.

బాబు : నాకే మొస్తుంది చదువు. చదువుకుంటానంటే చదువుకో నివ్వవు: ఏమైనా సరే నేనీ యేడు బడికిపోతాను. వాడికంటే ఎక్కువ చదువుతాను.

రత్తమ్మ : అలాగేకాని- మరికొట్టు సంగతి ఎలాగురా?

బాబు : అక్కయ్యేం చేస్తుంది? ఉండమను.

రత్తమ్మ : ఆడదొక్కతి ఒంటరిగా అక్కడ వుంటుందటరా? తప్పు కాదూ?

బాబు : తప్పేం తప్పు. హాయిగా అక్కడే కూచొని వూళ్లోవాళ్ళ బట్టలు కుట్టొచ్చు.

రత్తమ్మ : ఎలా చావాలిరా మీతో. ఊళ్ళోవాళ్ళ బట్టలని వూరికే అలా అనొచ్చా? అక్కయ్య వింటే బాధపడదూ?

బాబు : ఎందుకేం?

రత్తమ్మ : ఎందుకంటే ఏం చెప్పను? ఖర్మ.

బాబు : ఊం- ప్రతిదానికీ కర్మంటావు మరి- అక్కయ్య నక్కడ వుండ మనవూ? నేను బడికిపోతానంటే వుంటుందే. పోనీ నేను అడగనా?

రత్తమ్మ : ఢిల్లీకొట్లో ధ్వంసమనీ, వూళ్ళోవాళ్ళ బట్టలు కుడుతున్నా వనీ అనేవు సుమా.

బాబు: అంటే ఏమే.

రత్తమ్మ : అంతేపమే, అంతేపమే. ప్రతిదానికీ కారణం కావాలేం. (మాటమార్చడానికి) అన్నం తిందువుగాని రా.

బాబు : నన్ను చదువుకు పంపంది ఇవేళసలు అన్నమే తినను.

రత్తమ్మ : ఇలా మంకుపట్టు పడితే చదువొస్తుందా? వీపు చిట్లిస్తుంది- ఏమనుకున్నావో.

బాబు : కొట్టమ్మా, కొట్టు, చంపు.

రత్తమ్మ : (చప్పున ఎత్తుకొని) అబ్బా - ఎలా చావాలిరా నీతో. ముందు అన్నం తిను బాబూ.

బాబు : నాకు అన్నమొద్దు, ఏమొద్దు.

రత్తమ్మ : (బతిమాలుతూ) ఒక్కముద్ద.

బాబు : నేనసలే తినను.

రత్తమ్మ : (దింపి) సరె నీ ఇష్టం. బతిమాలినకొద్దీ కొంచెక్కి కూచుంటున్నావు. ఆకలవుతే నువ్వే వస్తావు. (రత్నమ్మ లోపలికి పోతుంది. బాబు విచారంగా కూచొని వుంటాడు. ఇంతలో

రామం - నన్నా నన్నానాన్నా ననానా నన్నానా నన్నా ననాన్నా... (అంటూ వస్తాడు. బాబును చూస్తాడు) ఒరేయ్- ఏమిట్రా ఎర్రిమొగమా? ఒరె ఒరె. నాతో చెప్పవటరా? (దగ్గరికెళ్లి) ఇంత బంగారుమోము పెట్టడం ఎప్పటినుంచి నేర్చావు తండ్రీ?

బాబు : (మూతిముడిచి) నేను మాట్లాడను.

రామం : సరిపోయింది. మాట్లాడకపోతే మాట్లాక పోయావుగాని- ఏమిటో చెప్పు చూద్దాం.... ఉండుండు తుణం. కాస్త పీకె తడపనీ. (చుట్ట కాలుస్తాడు) ...ఇదిగో ఒక్క దమ్మేసుకుంటావా?

బాబు : ఛీ పాడువాసన.

రాముం : వాసనలేకపోతే కాల్చేవాడివి కదురా? అయితే - సిగ రెట్లు కాలుస్తావు కాబోలు.

బాబు : అవి కాలిస్తే గుండె చెడిపోతుందట.

రామం : సరిపోయింది. నువ్వా గుండెనూ, వొళ్ళునూ. కాపాడు కోడంలో పడ్డావూ ? ఇంకా యేం బాగానేవుంటుంది. పోనీలే గాని—ఏమిటిలా బంగారు మోము బెట్టావు?

బాబు : నేను చెప్పను.

రామం : అయితే నేను లారీవేసుకొని ఒంటరిగా వెళ్ళిపోతామరి.

బాబు : నన్నూ తీసుకుపో కక్కయ్యా.

రామం : మరెందుకుచెప్పు ఇలాకూచున్నావు ?...అమ్మ కొట్టిందా ?

బాబు : నేను చదువుకుంటానంటే అమ్మ వద్దంటున్నది.

రామం : సరిపోయింది. అదా నీదిగులు, ఈమాత్రం నా చెవినవేస్తే అంతా అవల్ రైట్ చేయకపోయానూ ?

బాబు ; చదువుకో మన్నావా ?

రామం : తప్పకుండా. ఇప్పుడంటేఇప్పుడు బడికెళ్ళు.

బాబు : మరి—అమ్మ చదువొద్దంటున్నదే ?

రామం : అమ్మా నాన్నా అంతావల్లమాలిన దిగులులో వున్నారు. నువ్వకూడా ఎందుకుపడ్తావు ? నేనంతా అవల్ దర్జా చేస్తాగా.

నన్నా నన్నానానా నన్నానా.
చదువుకోనూ తల్చుకుంటే. .
చక్కగానే నేర్వరా

చదువువొద్దని అనుకుంటే
కొట్టుమీదనె వుండరా
నన్నా నన్నా నానా.......

(ఇంతలో రత్తమ్మ వస్తుంది)

రత్తమ్మ : ఏరాబాబూ! అన్నానికొస్తున్నావా ?

బాబు : అమ్మా! కక్కయ్య చదువుకోమంటున్నాడే.

రత్తమ్మ : చదువుకుంటే ఎవరొద్దన్నారుగాని— కొట్టుసంగతి ఎట్లాగయ్యా నెలకు కాస్తోకూస్తో వచ్చేపని. ఈస్థితిలో అది వదులుకుంటే ఎలా ?

రామం : సరిపోయింది. నే నున్నాగదూ ?

రత్తమ్మ : ఇదేమిటి ! నీపని నీకులేదూ ?

రామం : వదులుకుంటే ఎలావుంటుంది ?

రత్తమ్మ : ఏమ్మాటయ్యా అది ? వదులుకోవడ మేమిటి ?

రామం : వొదులు కోవడమంటే వొదులు కోవడమే. వెధవ 35 రూపాయలు ఈకొట్టుమీదనే వెళ్లదీస్తాను. అస్తమానంలారీ మీదతిరగలేక నా ప్రాణం సుడి బడుతున్నది.

బాబు : మరి అదిమానేస్తే లారీలో తిరగడమెలా కక్కయ్యా ?

రామం : సరిపోయింది. ఇప్పుడింకా బాగాతిరగొచ్చు. మారేందిగులు పడకు.

రత్తమ్మ : ఏమైనా ఉన్నఉద్యోగం వొదులు కుంటారటయ్యా ?

రామం : (వెటకారంగా) బంగారంలాంటి వుద్యోగం గదూ. ఇకమళ్ళీ

దొరుకుతుందీ ? ఏం ఫర్వాలేదు. ఏమైనాసరే—ఇప్పుడు బాబు చదివేది చదివేదే.

రత్తమ్మ : ఏమిటో వాడి చదువుభారం, అమ్మాయి చదువుభారం. ఇంటిభారం-ఇవన్నీ నెత్తినబెట్టుకొని ఎంనిభాయించగలవయ్యా!

రామం : సరిపోయింది. నిభాయించలేకపోతే పోతాన్లే. దానికి ఇప్పుడే ఎందుకూ అంటాను దిగులు ?

రత్తమ్మ : ఏమిటోనయ్యా—ఈ నిర్ణయమేమీ బాగాలేదు.

రామం : అట్లాఅనుకుంటే అట్లాగేవుంటుంది.

ఇట్ల అనుకున్నొక్కటే
అట్ల అనుకున్నొక్కటే
ఈ చిత్రజగతిని
ఎట్ల అనుకున్నొక్కటెరా
నన్నా నన్నానానా నన్నానా.........

రత్తమ్మ : ఏం నన్నానాయో. అన్నానికి రండి ఇద్దరూ.

(రత్తమ్మ లోపలికెడుతుంది)

రామం : ఇదిగో—క్షణం, ఈపీకె అయిపోవచ్చింది. నువ్వుముందు ఫదరా బాబూ.

(బాబు వెళ్లిపోతాడు. ఇంతలో భద్రయ్యాలోపల్నించి 'హాలులో ఎవరు ?' అని పిలుస్తాడు. 'ఆఁ వస్తున్నా' నంటూ రామం లోపలికెడతాడు. కాస్త సేపటికి భద్రయ్యతో నెమ్మదిగా రామం ప్రవేశించి, భద్రయ్యను కుర్చీలో కూచోబెడతాడు)

భద్రయ్య : హాబ్బ ! గాలి ఆడడంలేదు లోపల.

రామం : ఇక్కడా అట్లాగేవుంది.

భద్రయ్య : అక్కడ విసనకఱ్ర వుంది. కాస్త తెచ్చి విసురునాయనా. (లోపల్నుంచి ఇందాకటి విసనకఱ్ర తెస్తాడు. విసురుతూ)

రామం : గౌరీ ! గౌరీ ! (గౌరిమూతి తుడుచుకుంటూ వస్తుంది) అన్నం తిన్నావా ? (అవునన్నట్టు తలవూపుతుంది) సరిపోయింది. మూగనోము పట్టావే ?...కాస్త నాన్నకు విసురుతూవుండు. నేను అన్నానికి వెడతాను. (విసనకఱ్ర గౌరిచేతికిచ్చి రామం లోపలికెడతాడు. గౌరివిసురు తుంటుంది)

భద్రయ్య : మూగనోము పట్టకేంచేస్తుంది తల్లి. (ఈమాట విని విసనకర్ర అక్కడపడేసి వెళ్లబోతుంది గౌరి) ఆమాట ఎత్తనులే తల్లీ—వెళ్ళకు.... ఇక విసరవద్దులేగాని కాస్త భాగవతం తే అమ్మ. (గౌరి లోపలికెళ్లి భాగవతం తెస్తుంది) ఏదో వక పద్యం చదువుతల్లీ.

గౌరి : (భాగవతంలో చూచి)

ఇందుగల డందులేడని - సందేహమువలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకిచూచిన - అందందే కానవగును
దానవాగ్రణికంటే.

భద్రయ్య :(పద్యం అయిపోగానే) ఇందాక పెళ్లివారొచ్చి పేరంటానికి పిలిస్తేఎందుకు వెళ్లలేదు తల్లీ. సీతమ్మకూనీకూ ఎంతోస్నేహంకదూ ? (గౌరిపుస్తకంవైపు చూచుకుంటూ ఏసమాధానమూ ఇవ్వదు.) ఆఁ—అర్థమైందిలే అమ్మ. కొత్తబట్టలులేవని వెళ్లలేదు. పదిమందీ నవ్వుతారనీ వెళ్లలేదు. అంతేనా తల్లి ? నాకు తెలుసమ్మా - నీదిగులు నాకుతెలుసు...హారిహారీ - ఎక్కడున్నావు

తండ్రీ? (గౌరి నెమ్మదిగాలేచి వెళ్లిపోతుంది) వెళ్లావూ? నామీద కోపంవచ్చి వెళ్లావాతల్లీ! నేనేంచెయ్యను చెప్పు... ఎవరే లోపల?...ఇంకా భోజనాలు కాలేదూ? (రత్తమ్మ చేయితుడుచుకుంటూ వస్తుంది) చూశావటే - అమ్మాయికి నామీద కోపంవచ్చింది.

రత్తమ్మ : ఆ—కోపం. అదిచెప్పిందా కోపంవచ్చిందని?

భద్రయ్య : అది చెప్పాలటే. దానిముఖకవళికలు చెప్పవూ? భగవధ్యానంవరకూచేసింది. దాని విషయ మడిగితే లేచిపోయింది.

రత్తమ్మ : మరి మాటిమాటికీ అడిగి దానిమనసు నొప్పించడమెందుకూ? పొద్దున అన్నయ్యా తానీ సంబంధం చేసుకో నన్నప్పటినుంచీ అమ్మాయి మనసంతా అదోవిధంగా అయిపోయింది. ఏమిటో వస్తే కష్టాలు ఒక్కసారేవస్తాయి.

భద్రయ్య : ఆపదలో ఒక్కడూ అక్కరకురాడు. ఉన్నప్పుడే చేర్తారంతా.... చిన్నప్పట్నుంచీ వాళ్లిద్దరూ ఎంతగా కలిసి తిరిగారు. ఒకసారి ఆవేణన్నా వచ్చిపోతే బాగుండును.

రత్తమ్మ : రావాలనుకున్నా అన్నయ్యా ఈస్థితిలో రానివ్వవద్దూ? వాడు వస్తే దాన్నికాదనడని అన్నయ్యాకు తెలుసు.

భద్రయ్య : హరిహారీ చూస్తూవుండగానే కాలం ఇట్లామారిపోతున్నది. ఏంచేస్తాం?

రత్తమ్మ : ఈస్థితి ఇట్లావుంటే రామం లాంఠీఉద్యోగం మానేస్తానంటున్నాడు,

భద్రయ్య : అయ్యో - అదేం ఖర్మ?

రత్తమ్మ : అబ్బాయిని బడికిపంపి ఆయనొక్కడే కిర్లీకొట్టుపని చూస్తాడట.

భద్రయ్య : ఎంతచూచినా - ఇద్దరు సంపాదించేదీ, ఒక్కరు సంపాదించేదీ ఒకటవుతుందటే ?

రత్తమ్మ: అంతా వెళ్లదీస్తా చూడమంటున్నాడు, ఏం వెళ్లదీస్తాడో. అటు అబ్బాయి చదువూ ఇటు అమ్మాయిచదువూ; అదేంచదువూ ?

భద్రయ్య : మెట్రిక్ చదువులే. ప్రయివేటుగా చదవొచ్చు.

రత్తమ్మ : అదొకటి పెట్టుకున్నాడా? ఇప్పుడు లారీ ఉద్యోగంమానేసి పూర్తిగాకొట్లో వుంటాడట.

భద్రయ్య : ఇదేం దుర్బుద్ధే. ఒక్కసారి వాణ్ణిట్లా రమ్మను.

రత్తమ్మ : ఆయనసంగతి ఈవేళమైనాకొత్తా? అనుకున్నాడో-చేశాడే. ఎవరు చెబితే వింటాడని. అక్కడికీ నే నెంతగానో చెప్పాను.

భద్రయ్య : నేనూ చెప్పి చూస్తాను.

రత్తమ్మ : అనవసరమండీ. ఎలాగైనా అబ్బాయి చదవాలంటున్నాడు. చదవక పోవడంవల్ల వాడెక్కడో అవమానం పొందాడట. అందుకని అదివాడి పట్టుదల. దానికి కక్కయ్య ప్రోత్సాహం.

భద్రయ్య : హారి భగవంతుడా. ఒకరు చెబితేవినరు; పిల్లకు స్వయంగా మంచి ఆలోచన తట్టదు. ఎన్నడైనా ఉన్న ఉద్యోగం వదులుకుంటాడటే — అందరూ ఉద్యోగాలు దొరక్క చస్తూంటే. మగవాడన్నాక ఉద్యోగముందా ? లేదా ? అని చూస్తారే గాని ఎంత డబ్బొచ్చేది ఎవరు చూస్తారే ? నా వరకు నేను

పంతులుగా 50 రూపాయలకు చేరి 80 రూపాయలవరకొచ్చాను.

రత్తమ్మ : మీ ఉద్యోగానికీ ఆ ఉద్యోగానికి పోలికెక్కడండీ.

భద్రయ్య : అవుననుకో. కాని-ఇదిమాత్రం అంత తేలిగ్గా దొరికేదశే. ఎలా దొరికిందో దొరికింది దాన్ని దక్కించుకోవడం మంచిదా ? వదులుకోవడం మంచిదా ?... ఏమిటో ఈ కాలపు వాళ్లకు చెప్పడమే కష్టం. రామ రామ. చెమటలు పోస్తున్నాయే.

రత్తమ్మ : విసరమన్నారా ?

భద్రయ్య : విసిరితే తగ్గే చెమటలశే పిచ్చిదానా. లోపలికి తీసుకపో.

(లోపలికి తీసుకెడు తుంటుంది)

హోరి భగవంతుడా ! ఎన్నికష్టాలు తెచ్చి పెట్టావేరా తండ్రీ. (లోపలి కెడతారు. లోపల్నించి నిక్కరుకు చెయ్యితుడుచుకుంటూ రామం 'నన్నానా' గొణుగుతూ వస్తాడు. జేబులోనుంచి చుట్టతీస్తాడు అగ్గిపెట్టెకనపడదు. వెంటవచ్చినబాబుతో)

రామం: బాబూ ! కాస్త నిప్పుపెట్టె తేఅయ్యా. (బాబు లోపలికెళ్లి అగ్గిపెట్టె తెస్తాడు)

బాబు : కక్కయ్యా మరి నాచదువు కుదురుతుం దంటావా?

రామం: కుదిరితే కుదురుతుంది. లేకుంటేలేదు. దానికి దిగులెందుకురా ?

సాగితే సాగిందిరా

సాగకుంటే ఏమిరా

దీని కోసం
దిగులు ఎందుకు చెప్పరా – నన్నా నన్నా.

బాబు : మరి - కక్కయ్యా ! నాకు హ్యేటు, బూటు అవి తెచ్చి పెడతావా ?

రామం: సరిపోయింది. ఈ కోర్కెలన్నీ పెట్టుకున్నావూ ? బాగానే వుంటుంది వ్యవహారం. మన వేషం చూడు ఎలావుందో ? కాకపోతె నువ్వు మంచిలాగు చొక్కా వేసుకొని దువ్వుకో. సరేనా ?

బాబు : కక్కయ్యా ! మరి నువ్వు దువ్వుకోవేం ?

రామం: సరిపోయింది. అడిగేవూ ? లన్నాన, న్నానానా

దువ్వుకున్నా యింతెరా
దువ్వకున్నా యింతెరా
ఈ చిక్కు జుట్టును
దువ్వ కుంటెనె బాగురా నన్నాన నన్నా నానా

సరేనా ? ఈ జుట్టును దువ్వుతా ననుకో. లారీమీద పోతుంటే మళ్ళీ గాలికి రెపరెప లాడుతుంది. దుమ్ము పడుతుంది. ఇక దాన్ని దువ్వేంలాభం ? అందుకని – దీన్ని ఇలాగే దర్జాగా వుంచేస్తాను. దువ్వలేదనే దిగులు దానికీ లేదు; దువ్వుకోలేదనే చింత మనకూ లేదు. ఇంకా ఏంకావాలి?

బాబు : అలాగైతే అసలే తీసెయ్యరాదూ ?

రామం: సరిపోయింది. అన్నావూ ? ఆ రోజూ వస్తుంది నాయినా. మొత్తం జుట్టుతీసేసి, కాషాయి బట్టలుకట్టి జైసీతారాం అని వెళ్ళవలసిన రోజూరావచ్చు.

బాబు : నీతో నేనూవస్తా కక్కయ్యా.

రామం: మీరంతా అలాకావల్సి వచ్చినప్పుడే నేనలా తయారవు తాను. నేను వెడితే నిన్నూ తీసుకెడతా. సరేనా?

బాబు : మరి కక్కయ్యా! నువ్వూ చదువుతానన్నావుకదా. పుస్తకాలుకూడా కొన్నావు. మానేశావేం?

రామం : సరిపోయింది. అడిగావూ? నాన్న మంచమెక్కడం, మనం లారీ ఎక్కడం జరిగిందిగా. ఇంకేం చదువు? గుండుపూజ చుట్టేశాం, అక్కయ్యను చదివిస్తున్నాం. ఇకనువ్వూ చదువు.

బాబు : నువ్వు చదువుకోకుంటే ఎవరే మనరా కక్కయ్యా?

రామం : అమ్మో! పెద్ద సవాలే. ఇదిగో (చుట్ట చూపుతూ) ఈ చుట్ట పీకె వేస్తున్నాంగా. మన వూళ్ళో తప్ప ఎక్కడా మనను చదవలేదేమని అడగరు. అడిగినా వినబడనట్టుగా వుంటాం; అంతగా వినిపించుకున్నా సమాధానమివ్వం. అసలు ఈ చుట్ట వేస్తుంటే ఎవరూ అడగనే అడగరనుకో.

బాబు : అయితే నేనూ చుట్ట కాల్చనా కక్కయ్యా?

రామం : సరిపోయింది. ఇటు తిరిగావూ? నీగుండె పాడవుతుందిగా, ఇప్పుడొద్దులే. చదువుకోలే. అదీ కుదరనప్పుడు ఎలాగూ రాసి పెట్టేవుంది.

రత్తమ్మ : (ప్రవేశించి) ఏమిటయ్యా- బాబుకు నూరిపోస్తున్నావు?

రామం : మంత్రాలు.

రత్తమ్మ : ఏమ్మంత్రాలు?

రామం : ఈ కష్టాలను జయించే మంత్రాలు. అంతగా ఇబ్బందులు ఇంకా వస్తే ఈ దమ్ము పట్టడం, జుట్టు తీసెయ్యడం.

కాషాయి బట్టలు వేయడం - వీటన్నింటికీ సిద్ధంగా వుండా ల్సిందేనని చెబుతున్నాను.

రత్తమ్మ : ఇక్కడికి ఉన్నవాటితోటే ఏడుస్తుంటే — ఈ ఈడున్నే వాడికా బోధలు చెయ్యొచ్చా?

రామం : మరి చెప్పవలసిన నాలుగు మాటలూ ఇప్పుడేగా చెప్పా ల్సింది. నన్నడిగితే దానికి తయారైనా వాడికి ఏదిగులూ లేదంటాను. అయినా- అంతా మనం అనుకున్నట్టే జరిగే ట్టుందే. అందుకని—అంతా మంచే ఎందుకు తెలిసుండాలి? చెడు కూడా తెలుసుంటే బాగ్గామా? నాకైతే నిజంగా ఇదేమంచి;

రత్తమ్మ: సరే— బాగానే వుంది నీబోధ.

రామం : అంతేలే. నిజం చెబితే అట్లాగే వుంటుంది. మీరైతే ఎంత సేపూ "అబ్బాయీ! కలెక్టరు చదువు చదువుకో; కళ్ళుతోడు తుడుచుకో; బట్టలు నలగనివ్వకు; జుట్టు చెదరనివ్వకు; మహా ఆరోగ్యంగా వుండు; చీమిడొస్తే చీదకయ్యా; దగ్గొస్తే దగ్గకు నాయినా ఎప్పటి బట్టలు అప్పుడే విడిచెయ్" ఇవ్వన్నీ నూరి పొయ్యడం— పాపం పసివాడు — వాటిని నెరవేర్చుకోడానికి నానా తంటాలు పడి, అందులో ఏది కుదరకపోయినా తట్టుకోలేక తలక్రిందు లయిపోయి బ్రతుకునంతా నానా కంగాళీ చేసుకోవడం. అది బాగుంటుంది మీకు, అంతేనా!

రత్తమ్మ : ఏమిటోనయ్యా నీ సంగతి నాకు బోధపడడంలేదు.

రామం : బోధపర్చుకోవాలనుకుంటేగా బోధపడేది. రారా బాబూ! మనం ఇంటెనక బావిదగ్గర కూచొని పాటలు పాడు కుందాం రా.

నన్నా నన్నా నానా....
నిజం చెబితే కటువురా
అబద్ధమైతే బాగురా
ఈ పిచ్చివారికీ
అబద్ధమే చెప్పాలరా నన్నానన్నా—

(రామం బాబు లోపలి కెడతారు)

రత్తమ్మ: ఏం నన్నా నన్నాయో (అంటూ నిలబడి వుంటుంది. ఇంతలో పెళ్ళివాద్యం వినబడుతుంది) గౌరీ! గౌరీ! (గౌరి వస్తుంది) ఎవరే ఆ పెళ్ళివాళ్ళు? (గౌరి మాట్లాడదు) సీతమ్మ అత్తవారింటి కెడుతున్నదేమో చూతాం పద— ఇక్కడుంటే ఎలా కనబడతారు? దొడ్డిగుమ్మాన చూతాంరా. (బిడ్డను పట్టి లాగుతుంది. గౌరి కదలదు) ఎలాగే ఈ మూగనోముతో ఎలా చావను? (రత్తమ్మ ఒక్కతే వెళ్ళిపోతుంది. వాద్యం ఎక్కువవుతుంది. వాద్యం ఎక్కువైనకొద్దీ గౌరి దుఃఖం ఎక్కువవుతుంది. బొటాబొటా కన్నీరు కారుస్తుంది. నిలబడి తట్టుకోలేకపోతుంది. నెమ్మదిగా అక్కడున్న బల్లదగ్గర కెళ్ళి ఏడుపు దిగమింగడానికి పుస్తకం తిరిగేస్తుంది. వేణు ఫోటో కనిపిస్తుంది. దాన్ని చూస్తూ కుమిలి కుమిలి ఏడుస్తుంది. వాద్యాలు మరీ హెచ్చుతాయి. ఇక తట్టుకోలేక ఏడుస్తూ ఫోటోపై చేయివేసి వొళ్ళు తెలియకుండా పోతుంది. ఇంతలో వాద్యాలు తగ్గుమొహం పడ్తాయి. అయినా గౌరి లేవదు. డాక్టరు వస్తాడు)

డాక్టర్: అమ్మాయీ! (గౌరి ఉలికిపడి లేచి— గభాల్న లోపలికి పరుగెడుతుంది. డాక్టర్ నెమ్మదిగా బల్లదగ్గర కెడతాడు. ఫోటో

కనిపిస్తుంది. ఫోటో, పుస్తకాలు పరకాయించి చూస్తాడు. గౌరి చప్పున వచ్చి ఫోటో తీసికొని వెడదామనుకుంటుంది. డాక్టర్ ఇవ్వబోతున్నట్టు నటించి ఇవ్వడు. గౌరి ఙక్క మొహంతో కళ్లు నులుముకుంటూ వెడుతుంది. డాక్టర్ ఫక్కున నవ్వుతాడు.)

డాక్టర్ : (గౌరి వెళ్లిపోతుండగా) అమ్మ ఏంచేస్తున్నదమ్మా?

రత్తమ్మ : (వస్తూనే) వస్తున్నా డాక్టరుగారూ! అటు సీతమ్మ అత్త వారింటి కెడుతుంటే చూస్తున్నా.

డాక్టర్ : అక్కడ సీతమ్మ అత్త వారింటి కెడుతున్నదా? ఇక్కడేమవుతున్నదో తెలుసా?

రత్తమ్మ : (ఆదుర్దగా) ఏమయింది ?

డాక్టర్ : మీ అమ్మాయి ఏంచేస్తున్నదో చూశారా?

రత్తమ్మ : ఏమిటో డాక్టరుగారూ! దాని సంగతి బొత్తిగా అర్థం కావడం లేదు.

డాక్టర్ : కాస్త అర్థం చేసుకోడానికి ప్రయత్నించండి. ఈ ఫోటో ఎవరిది?

రత్తమ్మ : ఏం? మా మేనల్లుడు వేణుది.

డాక్టర్ : నిన్న వచ్చారు చూడండి మీ అన్నగారు. వారి కొడుకేనా ఈయన?

రత్తమ్మ: అవును. గౌరి పుట్టగానే మేనరికం చేసుకోవాలని నే అన్నాను. అంతకన్నానా అన్నాడు అన్నయ్య. తర్వాత గౌరి చాలా కాలం మేనమామ ఇంట్లోనే పెరిగింది.

డాక్టర్ : అయితే - మీరనుకోడమే కాక - వాళ్లిద్దరి మనసులుకూడా కలిశాయన్నమాట ?

రత్తమ్మ : మనసులేమిటి డాక్టర్‌గారూ ! ఒక్క మాటలో వేణుకు గౌరంటే ప్రాణం. వాడు - ఇంట్లో ఉన్నన్నాళ్లా దానికి చదువు చెప్పుకున్నాడు; బస్తీ కెళ్ళినప్పుడుకూడా గౌరి కిష్ట మైనవి తెచ్చేవాడు. ప్లీడరీ చదువు కాగానే పెళ్ళి చేసుకుంటా నన్నాడు.

డాక్టర్ : మీ అన్నగారేమో ఇప్పుడు కాదంటున్నారు. అంతేనా ?

రత్తమ్మ : మీకు తెలియందేముంది డాక్టరుగారూ ! మా పరిస్థితి ఇలా మారింది చూసి ఈవేళ కాదంటున్నాడు.

డాక్టర్ : ఊఁహూఁ. మరి - మీ అల్లు డేమంటున్నాడు ?

రత్తమ్మ : తండ్రి కిష్టం లేనప్పుడు వాడేమంటాడో ? కాదని చేసుకుంటానంటే తండ్రి చదువైనా చెప్పిస్తాడో, లేదో. అయినా చదువయ్యేదాకా పెళ్లొద్దని ఇదివరకే అన్నాడు.

డాక్టర్ : అదేగా అన్నారు. ఇక చదువయ్యాక ఏ నిర్ణయాని కొస్తాడో చూడాలి.

రత్తమ్మ : అప్పటి సంగతేమోగాని - ఇప్పుడు మాత్రం అమ్మాయి పరిస్థితి బొత్తిగా బాగాలేదు డాక్టరుగారూ! అందులోనూ తన కొడుక్కు చేసుకోనని అన్నయ్య పొద్దున అని వెళ్లినప్పటి నుంచీ అమ్మాయి అసలు మాతో మాట్లాడడమే మానేసింది. లోలోపల ఏం స్వయంపాకం చేసుకుంటున్నదో ఏమో ?

డాక్టర్ : అవును బుద్ధి తెలిసిన పిల్ల. ఏమైనా మీరు కాస్త జాగ్రత్తగా వుండడం మంచిది.

భద్రియ్య : (లోపల్నుంచి) ఎవరది ?.... డాక్టరుగారా ?

డాక్టర్ : లేచారా ? వస్తున్నాను.

భద్రియ్య : వద్దు. నేనే అక్కడికొస్తా. పడుకొనిపడుకొని నడుములు లాగుతున్నాయి... ఏమేయ్ - కాస్త ఇటురావే. (డాక్టరు, రత్తమ్మ ఇద్దరూ లోపలికెళ్లి భద్రియ్యను తీసుకొచ్చి కుర్చీలో కూర్చోబెడతారు) మా స్నేహం చేసినందుకు మీకు శ్రమ ఇవ్వవలసి వచ్చింది)

డాక్టర్ : ఇందులో శ్రమ ఏముందండీ ?

భద్రియ్య : శ్రమ ఏముందంటున్నారా? హాయిగా ఇంటికి వచ్చిన వాళ్లకు వైద్యం చేయవలసినవారు - స్వయంగా పదిసార్లు రావడమే కాక నన్ను అటు ఇటు మొయ్యడంలో సాయపడ వలసిన గ్రహచారం మీ కెందుకండీ?

డాక్టర్ : అలా అనకండి. మీరేం నాకు పరాయివారా ? మిమ్ముల గూర్చి మా నాన్న ఎంతగా చెప్పారో మీకు తెలియదు.

భద్రియ్య : రాజారావుగారి సంగతి చెప్పారూ? ఆయన మంచివాడు; అందుకే ఆయన కళ్లకు అంతా మంచివాళ్లుగా కనిపిస్తారు. ఆయనసలు ఒకళ్లను చెడ్డవాళ్లని అన్నదెప్పుడూ? ఏ దివ్య లోకాల్లో వున్నాడో కాని బాగా జ్ఞాపకం చేశారు.

డాక్టర్ : నిజానికి మీరు నన్ను "ఏమండీ" అనడం బొత్తిగా బాగా లేదు.

భద్రియ్య : నాకళ్లముందు నా బళ్లో చదివితే "ఏమయ్యా" అనేవాణ్ణి. కాని - నేను పంతులుగా వచ్చేసరికే బస్తీ కెళ్ళారు. పెద్ద

చదువులు చదివారు. కనుక ఎలాగైనా మిమ్ములను అలా పిలవడమే భావ్యం.

డాక్టర్ : ఇక తమ దయ. . . ఎలా వుంది పరిస్థితి ?

భద్రయ్య: ఇంతలోనే మార్పా! నాలుగేండ్ల నుంచి లేని మార్పు ఈ పూటలో వస్తుందా? ఏదో మీరు చేదు గోలీలు ఇవ్వడం, నేను మింగడం; మీరు సూది మందివ్వడం, నేను తీసుకోడం. అంతే గాని మార్పేమీ లేదు. ఇదేం అన్యాయమండీ డాక్టరు గారూ! ఎంత సేపు మీ మందులే మీరు గాని నాంకాకావల్సిన మందివ్వరు గదా. ఒక్కటంటే ఒక్క గోలీ.

డాక్టర్: అలాగే లెండిగాని-ఇందా కిచ్చిన బిళ్ల వేసుకున్నారా?

భద్రయ్య: అదిగో-మీ ముందే వుందిగా చేదు మింగించే మనిషి ఆమె. నడగండి.

రత్తమ్మ: ఇక చేదు మాత్రలు మింగరట. దానికి అనుపానంగా పంచదారో, ఉప్పో కావాలట.

డాక్టర్: అమ్మో! అదిప్పుడెక్కడ.

భద్రయ్య: ఇప్పుడెక్క డేమిటండీ.అసలే లేవనండి.హాయిగా వుంటుంది. నేను మనుషులు తినేవేవీ తినకూడదు. నేను గొడ్డు కారం తినేవాణ్ణండీ. పప్పుచారంటే ప్రాణం. అలాంటిది ఉప్పొద్దు కార మొద్దు. ఎన్నాళ్లీ అవస్థ? ఒక్క గోలీ ఇస్తేనా అవస్థ, మీ శ్రమ తప్పేది. ఎంత మొత్తుకున్నా మీ మందే మీరుగాని నాకాకావల్సిన మందివ్వరుగా?

డాక్టర్: అలాగే నన్నాగా.అనవసరంగా ఆందోళన పడకండి.(చప్పున అక్కడున్న పుస్తకాల మీదికి దృష్టి పోతుంది) అన్నట్లు అవ

గడం మరిచాను. ఇక్కడ మెట్రిక్ పుస్తకాలున్నాయి. ప్రయవేటుగా ఎవరు చదువు తున్నారు?

భద్రయ్య: అది మీకు తెలియనే తెలియదా డాక్టరు గారూ! అదొక పెద్ద గాథ. మా తమ్ముడున్నాడుగా రామం. వాడసలు చదువు కుందామని తెప్పించాడు.

డాక్టర్: కాని సాగలేదేమో?

భద్రయ్య: ఎలా సాగు తుంది? అసలు వాడి చరిత్రే చిత్రమైంది. వినండి డాక్టరు గారూ!

రత్తమ్మ: ఇప్పుడదంతా ఎందుకండీ? ఆ పంపకాల వ్యవహార మంతా వారికి తెలుసుగా?

భద్రయ్య: తెలిస్తే ఏమే మళ్ళీ వింటారు. నీతో ఇదో చావొచ్చిందేమే. ఏదీ నన్ను చెప్పుకోనివ్వవు; నా రోగం ముచ్చట చెప్పుకో నివ్వవు; నా సంసారం ముచ్చట చెప్పుకో నివ్వవు.

రత్తమ్మ: సరే చెప్పండి. చెప్ప వద్దని కాదండీ. పదే పదే చెప్పడం వల్ల మీకు ఆందోళన, వినడం వారికి శ్రమ అంటున్నాను. అంతే గాని-మన సంగతి వారికెంత చెబితే అంత మంచిది.

భద్రయ్య: అయితే ఇంకేం. చెప్పనివ్వు మరి.

డాక్టర్: క్లుప్తంగా చెప్పండి.

భద్రయ్య: క్లుప్తంగానే చెబుతాను. లేకుంటే ఒక్కరోజులో తరిగే ముచ్చటా ఇది. నాకే జబ్బొచ్చే నాటికి మేము ముగ్గురం అన్న దమ్ములం. కలిసేవుండే వాళ్ళం. మా అన్నయ్యకు ఆరుగురు పిల్లలు నాకు ఇద్దరు. మా అన్నయ్యకు సహకార

శాఖలో పని. నాకు పంతులు పని. ఆయనకు నెలకు 60 వచ్చేవి. నాకు 80 బళ్లో, ట్యూషన్ల వల్ల 50 వచ్చేవి. అంతా కలిసే ఖర్చు పెట్టుకుంటూ వుండేవాళ్లం. రామం-నేను పనిచేసే బళ్లో చదివేవాడు. వాడికి జీతం అదీ లేకుండా చేశాను. ఇలా వుండగా ఐదేళ్ల క్రిందట ఈ రోగ మొగటి ప్రాప్తించింది. నన్ను అటూ ఇటూ వైద్యానికి తిప్పుకో రావడానికి రామం చదువు మానాడు. ఆ తిరడగంలో కాస్తో కూస్తో వెనకేసిన వన్నీ అయిపొయ్యాయి. ఆ స్థితిలో అన్నయ్య ఏదో తగాదా లాంటిది పెట్టుకొని వేరు పడ్డాడు. నాకు ఇలా వుండగా అలా వేరు పడిపోవడం తగదని రామం మా అన్నగారికెంతో చెప్పాడు.అయినా-ఎలా వింటాడులెండి. అతనిదీ పెద్ద కుటుంబం. నానుంచి వచ్చే రాబడిలేదు. ఆయన కొడుకులిద్దరూ చేతి కెదిగారు. ఇక కలిసుంటే కుదరదని వేరు పడ్డాడు. వేరు పడితే మాత్రం వచ్చిందేముంది? మన్ను ఈ కొంప; మా తాత కట్టించిన ఈ కొంప-రామం చదువు పూర్తిగా మాని నా సేవలో వుండి పొయ్యాడు. నా దాప రికం అయిపోయి-దీని పుట్టింటి వాళ్ళు పెట్టిన నగలు మిగి. లాయి. అవి నెమ్మదిగా అమ్ముతూ వచ్చాను. ఇక బస్తీలు. తిరిగి లాభం లేదని కొంపలోనే చద్దామని ఇక్కడికి చేరాను. దైవ వశాత్తూ మీరు దంట పడ్డారు. మా తమ్ముడు ఎలా గైనా చదవాలని మెట్రిక్‌కు కట్టాడు. ఇంట్లో వెళ్లడం చూళ్లేక చదువు మాని ఏదో బస్సులమీద తిరిగి లారీ నడపడం నేర్చి, ఆ పని సంపాదించాడు. ఇప్పుడేమో అమ్మాయునీ మెట్రిక్ చదివించాలని వాడి పట్టుదల.

రత్తమ్మ: ఈ ఏటినుంచి అబ్బాయిని కూడా చదివించాలనుకుంటున్నాడుగా.

భద్రయ్య: అదంతా మంచి పనేనే. నేను సరగావుంటే తప్పకుండా అలాగే చేసేవాణ్ణి. కాని అంతా నెత్తిన బెట్టుకొని పిడెట్లా నిభాయిస్తాడూ అంట.

రత్తమ్మ: అదే వినడు.

డాక్టర్: మొత్తమ్మీద సాహసుడనాలి.

భద్రయ్య: ఈ కష్టాలు చూసి వాడు బండబారాడండీ. అదీ వాడి తత్వం ఏ తత్వమైనా ఉన్నపని మానుకోవడం నాకేం ఇష్టం లేదు.

డాక్టర్: ఒహో ఈ పని మానెయ్యాలనా?

రత్తమ్మ: అవును మానేసి అబ్బాయి వుండే కిల్లీకొట్లో నే కూర్చొని ఎక్కువ సంపాదిస్తాడట.

భద్రయ్య: వాడి అంచనాలు మనకు తెలియవు డాక్టరు గారూ! ఇప్పుడు వాడు చెప్పినట్లు వినవలసిన వాళ్ళమే గాని మేము చెప్పినట్లు వాడు వినడుగా.

డాక్టర్: అలా అనకండి. ఇదంతా మీకోసంకాదూ?

భద్రయ్య: అవును నాకోసమే అంతా-మీదగ్గరినుంచి అంతా రాత్రింబవళ్ళు శ్రమ పడుతున్నారు. అందుకే ఒక గోలీ ఇమ్మంటే ఇవ్వరు గదా. అందరి శ్రమా తప్పేది. ఎంత సేపూ మీ మంగులే మీరుగాని నాక్కావల్సిన మందివ్వరు.

డాక్టర్: అలాగే ఇస్తాలెండి గాని-కాస్త విశ్రాంతి తీసుకోండి, మళ్ళీ వచ్చి చూస్తాను.

భద్రయ్య: మరీ మరీ చెప్పాననుకోక దయచేసికాస్త తరుచుగాచూడండి

డాక్టర్: తప్పకుండా మీరు పదే పదే చెప్పాలా. వీలున్నన్ని సార్లు వస్తాను. సరేనా?

భద్రయ్య:తమ దయ(చేతులెత్తి నమస్కరిస్తాడు.డాక్టరు వెళ్లిపోతాడు) ఈయన దేవుడే రత్నం దేవుడు. దేవుడు నయంచేసినాకు కుదరని రోగమైపోయిందేమే?

రత్తమ్మ: తొందర పడితే ఎలాగండీ?

భద్రయ్య:హారిహారీ. ఎంత మాటన్నావేమే. నేను తొందర పడుతున్నా నటే, ఒక్కటి కాదు, రెండు కాదు, నాలుగై దేండ్లనుంచి బాధ పడు తున్నానే. ఇది తొందరా! ఉమ్మెయ్యాలంటే ఒకరి సాయం కావాలి, బయటి కెళ్ళాలంటే ఒకరి సాయం కావాలి; చప్పిడికూడు తినాలంటే ఒకరి సాయం కావాలి. ఎంత అవస్థ వచ్చి పడిందేమే. ఇదివరకు మైలుదూరం చెంబు పట్టుకొని నడిచి పొయ్యాను; సోలెడు తప్పాలేదు అన్నం తిన్నాను. ఏమైపోయిందే ఆ బలమంతా. ఈ బ్రతుకు దుర్భర మైందటే. తెలియక ఈ పుట్టిక పుట్టానేమే?

రత్తమ్మ: ఏ పుటక పుట్టాల్సిందీ ఎలా తెలుస్తుందండీ?

భద్రయ్య : అదేనే వచ్చినచిక్కు..ఏ క్షణంలో ఏం జరుగుతుందో తెలియదు. ఉన్నట్టుండి వచ్చింది ఈ జబ్బు....ఆవేళ ఆదివారం. హాయిగా షికారు కెళ్లొచ్చాను. కమ్మగా భోంచేశాను. నవారు మంచమ్మీద పడుకున్నాను. నువ్వొ అన్నం తినొచ్చావు. ఒక్కటెచ్చి యిచ్చావు. రామం అంత దూరాన పిల్లలకు కథలు చెబుతున్నాడు. నిన్ను భాగవతం తెమ్మ

న్నాను. తెచ్చి చదువుతున్నావు. ఒక్క 'లా వొక్కింతయు లేదు' అనే పద్యం చదివావో లేదో హఠాత్తుగా ముంచు కొచ్చింది. అంతేనా ?

రత్తమ్మ : అంతేలెండి గాని ఇప్పుడదంతా ఎందుకండీ ? మీకు తెలి యందా ? నాకు తెలియందా ?

భద్రయ్య : అందరికీ తెల్సు. కాని — అనుకోడానికేమే ? నీతో ఇదో చావొచ్చింది. ఏదీ అనుకో నివ్వవే. చూడు ఒక్కసారి భాగవతం పట్రా. ఇందాక అమ్మాయి ఒక పద్యం చదివి కోపమొచ్చి వెళ్లిపోయింది.

రత్తమ్మ : దానికి కోపం వూరికే ఏం రాదు. దానికిష్టంలేంది అంటేనే వస్తుంది.

భద్రయ్య : ఏది ఇష్టమైందో,ఏది ఇష్టంకానిదో ఎలా తెలుస్తుంది ?ఏదో మన గ్రహచారవశాత్తు ఇలా జరుగుతుందనరాదూ ?

రత్తమ్మ : అంతే మరి.

భద్రయ్య : ఏదీ భాగవతం తేవేమే ?

రత్తమ్మ : ఇప్పుడేం భాగవతమండీ — ఇంట్లో బోలెడు పనుంటే.

భద్రయ్య : పనెప్పుడూ ఉండేదేనే.భగవధ్యానాన్ని కాదనకు. ఒక్క టంటే ఒక్క పద్యం చదువు. ఆయన మనను మరచినా మనం ఆయన్ను మరిస్తే ఎట్లాగే ? (ఇంతలో రత్తమ్మ భాగవ తంతో వస్తుంది) ఆ- చదువు. ఆ 'లావొక్కింతయు లేదు' పద్యమే చదువుతుంది. అది ఆఖరవు తుండగా గబగబా బాబు పరుగెత్తుకొని వస్తాడు. మహా ఆదుర్దాగా.)

బాబు : అమ్మా ! అమ్మా ! అక్కయ్య బావిలోకి దూకుతున్నది. [ఈ మాట అంటూ వుండగానే భళ్లున బావిలో ఏదో పడ్డ

చప్పుడవుతుంది. రత్తమ్మ, బాబులు చప్పున లేచి పరుగెత్తుతారు. రత్తమ్మ పోతూ పోతూ భాగవతాన్ని ఎత్తేసి దాన్ని తొక్కేసుకుంటూ పరుగెత్తుతుంది. తనకు దగ్గరలో వుండటంవల్ల భద్రయ్య దాన్ని ఎలాగో తీసుకొని కళ్ళ కద్దుకొని]

భద్రయ్య: అయ్యో-అపచారం. భాగవతాన్ని తొక్కావేమే....ఏమిటి నీ లీలలు స్వామీ ?.... బాబూ ! నన్నుకూడా తీసుకెళ్లురా నాయినా ! రత్నం ! నన్నుకూడా తీసుకెళ్లు. రామం! నువ్వున్నారారా తండ్రీ ! ఎవరూ రారు. నేను లేవలేను. ఎలాంటి స్థితి పెట్టావు తండ్రీ ! ఇన్ని కష్టాలు పెట్టడానికి ఎందుకని పుట్టించావు స్వామీ ! పుట్టించిన వాడివి నన్ను ఏ బ్రహ్మచారిగానో వుండనివ్వక ఒక సంసారం ఏర్పాటు చేశావు. ఇద్దరు పిల్లల నిచ్చావు. నాకీ రోగాన్నిచ్చావు. కొత్త ఆశలతో పుట్టినవాళ్ల కోర్కెలను భగ్నంచేశావు. వాళ్లు ఎన్నడన్నా తమతోటి వాళ్లువేసుకొన్న దుస్తులు వేసుకున్నారా స్వామీ ? తోటి వాళ్లలాగా చదివారా ప్రభూ ? వాళ్ల బతుకు బండలు చేశావు. నా పైన ఎన్నో ఆశలు పెట్టుకున్న పెళ్లానికి రాత్రింబవళ్లు నిద్రలేకుండా చేశావు. ఆ పిచ్చి వెధవ — తమ్ముడికి నామీద ఉండేట్టు ఏర్పాటు చేశావు. ఏమిటి స్వామీ ఈ చిత్రం ఇందంతా ఎందుకు చేస్తున్నావు ? ఏం పాపం చేశానని ఇన్ని తిప్పలు పెడుతున్నావు ? పోనీ — నేనంటే పాపాలు చేసి వుంటాను. ముక్కుపచ్చలారని వాళ్లేం చేశారు స్వామీ ! వారి ఎన్నడన్నా, ఎవర్నయినా పల్లెత్తి మాటన్నదా ప్రభూ ? అదేమో — దాని మనసేమో. నీలాగే దాని మనసుకూడా అంతుపట్టని మహాసముద్రం కాదా స్వామీ? నీ వంటే దాని కెంతభక్తి ప్రభూ ! ఇందాక నేగా స్వామీ.

నీ నామ సంకీర్తన చేసింది.... చంపెయ్ ప్రభూ నన్ను చంపెయ్. నా కళ్లెదుట పసికూనలు ఆత్మహత్యలు చేసుకుటూంటే నేను చూడలేను తండ్రీ. నన్నూ తీసుకుపో స్వామీ నన్నూ తీసుకుపో. నాకీ భూమ్మీద ఒక్క క్షణమైనా నిలువ బుద్ధి కావడంలేదు. స్వామీ! స్వామీ! నన్ను తీసుకుపో. లేదా — కాళ్లివ్వు. తండ్రీ నా బిడ్డను చూసుకోనీ. ఒక్కసారి చూచుకోనీ. లేదా దాన్ని బ్రతికించు స్వామీ. బ్రతికించు. కాపాడు స్వామీ. దీనులం. నీవు తప్ప మాకెవరు దిక్కు స్వామీ? నన్ను తీసుకుపో. లేదా కాళ్లివ్వు. స్వామీ - బిడ్డను చూసుకుంటాను. (హఠాత్తుగా ఉలికి లేవబోయి నడవలేక క్రిందపడి కొట్టుకుంటాడు. భాగవతంమీద పడి) తండ్రీ! బిడ్డను కాపాడు అదెన్నడూ. ఏపాపం చేసి ఎరుగదు. కావాలంటే నా ప్రాణాలు తీసుకో (అని భాగవతాన్ని కరచి పట్టుకొని సొమ్మసిలి పడిపోతాడు.... ఇంతలో రత్తమ్మ, రామం, బాబు, గౌరి వస్తారు. గౌరి, రామం డ్రస్సులు మార్తాయి. తలలు తడిసివుంటాయి. హఠాత్తుగా రత్తమ్మ భర్తను చూసి ఏడుస్తుంది)

రత్తమ్మ : ఇదేం కర్మండీ. (అని నెమ్మదిగా లేపి కుర్చీలో కూచోబెడుతుంది) రామం! కాసిని నీళ్లు తే నాయనా. (రామం లోపలికెళ్లి నీళ్లు తెస్తాడు. రత్తమ్మ- భర్త ముఖంపై నీళ్లు చల్లి, తర్వాత తాగిస్తుంది. భద్రయ్య తెప్పరిల్లినట్టు చూస్తాడు. అంతా బిక్కమొహాలతో నుంచుంటారు)

రత్తమ్మ : ఏమిటండీ ఇది?

భద్రయ్య : (ఆయాసపడుతూ) నాకేమైందే ? ఆ స్వామి నాతల్లిని రక్షించాడా? ఇట్రా అమ్మ, (గౌరిని దగ్గరకు లాక్కొని తల నిమురుతూంటాడు)

రత్తమ్మ : ఎంత అఘాయిత్యం! రామం సమయానికి లేకపోతే ఏమయ్యేది? (రామం తాపీగా చుట్ట కాలుస్తూ దూరంగా నుంచుంటాడు)

భద్రయ్య : అదృష్టమంటే అలాగే వుంటుంది. ఎందుకమ్మా అంత పని చేశావు? (గౌరి చెప్పదు) చెప్పుతల్లీ. నాతో చెప్పడానికేమమ్మా. ఇందులో పరాయివారెవరు? (చెప్పదు) చెప్పాలితల్లీ. చెప్పకుంటే నా ప్రాణాలు తీసెయ్యి. ఇదిగో ఈ కర్ర తీసుకొని నా తల పగులకొట్టు, (కర్ర నందిస్తాడు) ఏదన్నా చెయ్యి. చెప్పనన్నా చెప్పు. తలన్నా పగులగొట్టు (అయినా చెప్పదు) చెప్పవుకదూ. సరే చంపు.

గౌరి : (దుఃఖం పొర్లుకొస్తుంది) నేనెవర్నీ చంపను; నేనే చచ్చిపోతాను.

భద్రయ్య : (బ్రతిమాలుతూ) అంత ప్రాణమిప్పుడి కేమొచ్చిందమ్మా?

గౌరి : నేను మీ అందరికీ భారంగా వున్నాను. నాకు చదువులేదనీ, నాకు సరియైన బట్టలు లేవనీ, పోషణలేదనీ, తోటిపిల్లలను చూసినప్పుడు నేను చిన్నతనంగా వుంటున్నాననీ, పెళ్ళి కాలేదని, మామయ్యా ఆ సంబంధం ఇవ్వలేదనీ, నేను గుండెమీద కుంపటిలా వున్నాననీ మీరంతా కుమిలిపోతుంటే నేను చూడలేకుండా వున్నాను. నా ఈడువాళ్లంతా పెళ్లిళ్ళయి అత్తవారింటికి పోతుంటే నేను పెళ్ళి లేకుండా ఇలాగేవుండి-

ఈ కష్టాన్ని భారం చేయడం సహించలేకపోతున్నాను. నేను పోతే నా పెళ్ళి కాలేదనే దిగులుపోతుంది; మామయ్యా నన్ను కోడలుగా చేసుకోవలసిన బాధా తప్పుతుంది; కక్కయ్యా నాకోసం కష్టపడి డబ్బు ఖర్చుపెట్టి చదువు చెప్పించాల్సిన భారమూ తగ్గుతుందనుకొని ఇలా చేశాను.

రామం : సరిపోయింది. ఇవ్వన్నీ మనసులో స్వయంపాకం చేసుకొని ఇంతపని చేస్తావా? నాకులేని కష్టం నీకేమిటి? నన్నా నన్నా.

భద్రయ్య : రామం! ప్రస్తుతం కాస్త నువ్వూరుకో నాయినా.

రామం : సరె. అడిగి తెల్సుకోండి. నేను వెడతాను. (లోపలికెడతాడు)

రత్తమ్మ : ఈ కష్టాలు నీ ఒక్కదానికేనా తల్లీ. మాకందరికీ లేవూ? ఏదో వుండబట్టలేక అప్పుడప్పుడు అనుకున్నవన్నీ మనసులో పెట్టుకొని ఇంత పని చేస్తారటే పిచ్చిదానా?

భద్రయ్య : దానికి గుండెనిబ్బరం లేదేతల్లీ! బహుసుకుమార హృదయం తల్లీ నాదెంతకష్టమైన జీవితమో ఎన్నడైనా ఆలోచించావా? సంపాదించే సమయంలో ఈ జబ్బొచ్చింది. అటు సంపాదన పోయింది. అదెంత దెబ్బ? దానికి తోడు ప్రతిక్షణం ఆదుర్దా కలిగించేజబ్బు, ఆరోగ్యవంతున్ని చూసినప్పుడల్లా నేనెంతగా కుమిలిపోతానో, ఎంతగాసిగ్గుపడ్తానో నీకు తెలియదు. పైగా నేనే ఈ జబ్బును కొనితెచ్చుకున్నాననే వాళ్ళనుచూస్తే ఎంత కోపమొస్తుందో నీవెరగవు. కాని - ఏంచేయను? అవ్వన్నీ చేదు మాత్రలు మింగినట్టు మింగేసి వూరుకుంటాను. అంతే కాని - చావదలుచుకుంటే అక్కడున్న తాడుచాలదు తల్లీ.

కష్టాలకు అంతభయమూ తల్లీ. వస్తాయి. కష్టాలంటే - మనుషులకా కాక మానులకొస్తాయా ? వాటిని ధైర్యంగా ఎదుర్కోవాలమ్మా. అయినా ఇంతహఠాత్తుగా ఆనిర్ణయానికెందు కొచ్చావమ్మా ?

గౌరి : నేను వాళ్ళవీళ్ళ గుడ్డలుకుట్టి పొట్ట పోసుకుంటున్నానని అంటుంటే ఇక పట్టలేక పొయ్యాను.

రత్తమ్మ : ఆమాట ఇప్పుడెవరన్నారు ? బాబేమైనా అన్నాడా ? (గౌరి మాట్లాడదు. బాబు నెమ్మదిగా బయటికి జారుకోబోతాడు)

భద్రయ్య : అరేయ్ - ఇట్రా ! (దగ్గరికొస్తాడు)

రత్తమ్మ : అట్లా అంటారటరా ? తప్పని చెప్పలేబాబూ ?

బాబు : ఇట్లా అవుతుం దనుకోలేదే.

భద్రయ్య : (బాబు చెవులుపిండుతూ) అనుకోలేదేం ? వెధవొచ్చావు? అనుకోలే ? (కర్రతో బాత్తాడు. బాబు కిందపడిపోతాడు.)

గౌరి : వాడితప్పులేదు నాన్నా. కొట్టకు. (అని వారించబోతుంది. భార్యకూడా అలాగే దగ్గరికెళ్ళి బాబును కొట్టకుండా భర్తకు అడ్డుపడ్తుంది. కాని - భద్రయ్య వూరుకోడు. పైగా - వారి మీదికికూడా కర్రవిసురుతాడు. అలాగే కొడుకును బాదుతుంటాడు.

భద్రయ్య : అది - వారిపిరి బట్టలుకుడితే అవమాన మొచ్చిందేం ? నువ్వు కిళ్ళీకొట్లోవుంటే తప్పులేదురా ? వెధవొచ్చావు. ఆడదాన్ని పట్టుకొని అంతమాటంటావుగా. చావువెధవ చావు.
[రత్తమ్మ, గౌరి "అయ్యయ్యో" అని ఎంతఅరిచినా ఆగడు]

దాన్ని అంతమాట అంటావుగా ? అవమానిస్తావుగా ? (ఎంత మొత్తుకున్నా భద్రయ్య వినడు. బాబుకిందపడి ఏడుస్తుంటాడు. ఆడవాళ్లు దగ్గరకురాకుండా భద్రయ్య కర్రవిసురుతాడు. ఆడ వాళ్లు అరుపులువిని రామం గబగబావచ్చి నోట్లోవున్న చుట్ట విసిరేసి చప్పున అన్న చేతిలోవున్న కర్రనులాగేసి బాబును ఎత్తుకుంటాడు)

రామం : అందరందరనే. చావడం, చంపడంతప్పితే మరోమాట చేతేదే ? (రామంచేతిలోంచి రత్తమ్మ కొడుకునుతీసికుని ముఖం తుడుస్తుంది. ఇక భద్రయ్యచేతగాక చెమటలుపోసి కూలబడ్డాడు.

రత్తమ్మ : అయ్యోరామ ! ఇంతకోపమైతే ఎట్లా పాడవుతుంది ? బిడ్డను చేతులారా చంపేవారే. రామం! చప్పున డాక్టరుగార్ని రమ్మను నాయినా. పిళ్ళపరిస్థితి ఇలావుందనుకుంటే - ఆయ నేమో అలిసిపొయ్యారు. (బాబును పిపుమీద పడుకోబెట్టుకుం టుంది) తల్లీ ! నాన్నను లోపలికి తీసుకుపో. [గౌరి తండ్రిని లేపబోతే కళ్లుమూసుకొని కోపంగా లేవనంటాడు]

గౌరి : లేవడట.

రత్తమ్మ : విసరవన్నా విసురమ్మ. (గౌరి విసురుతుంది) బాబూ! ఆ మాట అక్కయ్యతో అనవద్దురా అంటే వినకపోతివి. ఇంత అనుభవిస్తివి. మిమ్మల్నని ఏం లాభం? నాకడు పటువంటిది. మన ఖర్మ.

భద్రయ్య : (చేతులు పైకెత్తి నమస్కరిస్తూ) తండ్రీ - వాసుదేవా క్షమించు తండ్రీ. రోగానికితోడు కోపాన్నికూడా పెట్టావు

ఏమిటి నీ చేష్టలు నాకేమీ అంతుబట్టడం లేదు. (కొడుకు నిమ్మని భార్యవైపు చేతులు చాచి) బాబూ! ఇలారా నాయినా! కోపంరా తండ్రీ– కోపం; ఒళ్లు తెలియని కోపం. (బాబు రాడు) కోప మొచ్చిందా నాయినా, వస్తుంది. రాడు మరి చేసుకున్న వానికి చేసుకున్నంత ... వెళ్ళండి, మీరంతా వెళ్ళండి. విసరొద్దు, ఏమొద్దు. కాసేపు ఇక్కడే పడుంటాను. వెళ్ళండి. (అంతా లోపలికి వెడతారు. భద్రయ్య కుర్చీలో వెనక్కువాలి కళ్లు మూసుకుంటాడు. నోరేదో జపిస్తున్నట్లు కనిపిస్తుంది. మధ్యమధ్య చేతులు పైకెత్తి నమస్కరిస్తుండగా డాక్టరు, రామం వస్తారు)

డాక్టర్ : ఏవరికండీ నమస్కరిస్తున్నారు?

భద్రయ్య : అందరికీ, ఎవరిపట్ల తప్పు చేశానో వారందరికీ.

డాక్టర్ : ఆఁ బాగానేవుంది. ఇంతగా అలిసిపోయారేం? .... రామం! వారిని కాస్త పట్టుకో. ముందొక ఇంజక్షనిస్తాను. (అంతా వచ్చి నిలుచుంటారు. రామం - అన్నను పట్టుకుంటాడు. డాక్టరు ఇంజక్షనిస్తాడు) అసలే కొన్ని బాధలొచ్చాయి: మరి కొన్ని మీరు కొని తెచ్చుకుంటారు.

రత్తమ్మ : మొదటినుంచీ వారి స్వభావమండీ.

డాక్టర్ : అంతా విన్నానండీ. ఇందులో ఎవర్నీ ఏమని లాభంలేదు. (ఒక గోలీ తీసి) ఈ గోలీ మింగండి. (గౌరితో) నీళ్లు తే అమ్మా- (భద్రయ్య అలిసిపోయి నోరు మూసుకొని వుంటాడు) నోరు తెరవండి భద్రయ్యగారూ! ఈ గోలీ మింగండి.

భద్రయ్య : నాకాక్కావల్సిన గోలీ యేనా?

డాక్టర్ : ఆ. అదే- మింగండి.

భద్రయ్య : (నోరు తెరిచి మింగుతూ) ఇదేదో కాస్త తియ్యగా వున్నట్టుంది. అవును- అదే. (గౌరి నీళ్లు తెచ్చి నోట్లో పోస్తుంది)

డాక్టర్ : ఎంత విశ్రాంతిగా పడుకుంటే అంత మంచిది.

రత్తమ్మ : చాలా అలిసిపొయ్యారండీ.

డాక్టర్ : విన్నానండీ- అంతా విన్నాను. ఈ కష్టాలకు అంతేమిటో నాకు కనిపించడంలేదు...సరే-మళ్లీ వస్తాను. (వెళ్ళబోతాడు)

రత్తమ్మ : ఒకసారి అబ్బాయిని చూసి వెడతారా?

డాక్టర్ : అలాగే. (సంచి సర్దుతూ) అన్నగారిని లోపల పడుకోబెట్టు.

రామం : మంచిది. రా గౌరీ. (ఇద్దరూ నెమ్మదిగా భద్రయ్యను లోపలికి తీసుకెడుతుంటారు. డాక్టరు, రత్నమ్మ ముందే లోపలికెడతారు, భద్రయ్య లోపలికి పూర్తిగా వెళ్ళిన కాసేపటికి రత్తమ్మ, డాక్టరు హాలులో కొస్తారు)

డాక్టర్ : (వెళ్లిపోతూ) అబ్బాయికేమీ భయంలేదండీ. కాస్త కాపండి. అంతే.

రత్తమ్మ: మీరు మళ్ళీ వెంటనే వస్తారు కదూ? ఆయన గారు కాస్త ఎక్కువ మాట్లాడితేచాలు — రక్తపు పోటు ఎక్కువవుతుంది. ఇక ఇంత ఆందోళన పడ్డారు. ఏమవు తుందోనని చాలా భయంగావుంది డాక్టరుగారూ.

డాక్టర్: భయపడకండి నేను కాచుకొనే వుంటాను. సరేనా?

రత్తమ్మ : తమ దయ. [డాక్టరు వెడతాడు] రామం [రామం, గౌ వస్తారు] అన్నయ్య నిద్రపొయ్యారా ?

గౌరి : పోతున్నాడు.

రత్తమ్మ: మీ రాయన్నేమీ లేపకండి.

రామం: సరిపోయింది. ఆయన మనను పిలవకుంటేచాలు. నన్నా నన్నా నానా...

రత్తమ్మ : (వెంటనే అందుకుంటూ) ఏం నన్నా నన్నా నాయో. బాగానే వుంది వరుస. (కాస్త చిరాకు, కోపం, దుఃఖంతో, వెడుతుంది)

రామం : చెప్పాకదూ- ఎప్పటికైనా ఇదే బాగుంటుందని. (రత్తమ్మ ఏసీ వినకుండా వెడుతుంది]

గౌరి : కక్కయ్యా! అందరిదో తత్వమైతే నీదో తత్వమే ?

రామం : సరిపోయింది. అడిగావూ! క్షణం పీకె తడుపుకోనీ. (చుట్ట కాలుస్తాడు) ఆఁ ఏమన్నావూ?

గౌరి : అందరి దోతత్వమైతే నీదో తత్వమే అని.

రామం : అవును మొండితత్వం

మొండిదైతే ఏమిరా
మొగ్గదైతే ఏమిరా
ఈ జగతిలోపల
మొండిబ్రతుకే మేలురా నన్నా నన్నా నానా ...

అదీమాట ! మొండంటే నేను. మొగ్గంటే నువ్వు. నన్ను నాలుగు తిట్టినా, కొట్టినా పడతాను. నిన్ను ఎవరూ ఏమీ అనకముందే అంటారని వూహించుకొని అమాంతంగా ముప్పు కొనితెచ్చుకుంటావు అదీ నీ తత్వం. అవునా?

గౌరి : మరి- నీలాగా మొండిగా వుండడం బాగా?

రామం : సరిపోయింది. మరి లేకుంటే నీలాగా సున్నితంగా వుండి అడుగడుగునా - బావిలో - కాకుంటే చెరువులో దూకనున్నావా?

గౌరి : నిన్నెవరేమన్నా అంటే అభిమాన మనిపించదూ?

రామం : అభిమానమూ! దాని పిలక నులిమి పారేశాగా. మొదట్లో నాకూ నీలాగే వుండేదిలే. అన్నయ్య మంచమెక్కాడు. బడి మానేశాం. పట్నాలన్నీ తిరిగాం. కష్టాలు పడ్డాం. చుట్టచేత బట్టాం. క్లీనరుపనిచేశాం. అవసరమైన చివాట్లన్నీ తలవాచేట్లు తిన్నాం. లారీ ఎక్కాం. అభిమాన మనేది బంద్. అలాగని మనం ఒకరి జోలికి పొయ్యేది లేదు; ఒకడు మీదికొస్తే ఊరుకునేది అంతకంటే లేదు.

గౌరి : మరి- నిన్నెవరన్నా చదువుకోలేదని ఎగతాళి చేస్తే కోపం రాదూ?

రామం : సరిపోయింది. అడిగావూ! దానికో మంత్రం నేర్చాగా.

గౌరి : మంత్రమూ! నాకు నేర్పుతావా ?

రామం : నేర్పడం ఎంత సేపుగాని - నువ్వు నేర్వవద్దు

గౌరి : పోనీ చెప్పు చూతాం.

రామం : నన్నెవరన్నా చదువురానిమొద్దు అని అంటారనుకో. ఏం చేస్తానో తెలుసా ?

గౌరి : ఏం చేస్తావు ?

రామం : బాబులాగా అవమానపడి ఏడ్వను. అవతలివాడి లెంప వెయ్యను. పకపకా నవ్వుతాను. ఎందుకంటే - మరి నిజం గానే నాకు పెద్ద చదువులు రావుగా. అంటే తప్పేముంది? అందుకని నవ్వుతాను కాకపోతె - మహా కోపమొస్తే — లారీ నడపవోయ్ — అది చదువే నోయ్ మొద్దూ అంటాను.

గౌరి : అంటే - ఏదైనా చదువే నంటావు.

రామం : కాదూమరి. లారీ నడపటం విద్యే; ఇంటి పని చెయ్యడం విద్యే; విస్తళ్లు కుట్టడం విద్యే; బట్టలు కుట్టడం విద్యే; అన్నీ విద్యలే.

గౌరి : మరి - ఇతరుల బట్టలు కుట్టడం తప్పుకాదూ ?

రామం : సరిపోయింది. మరి అడిగావూ ? మరి నేను నడిపే లారీ ఎవరిదనుకున్నావు ? నాదా ? ఈరబోయిన కోటయ్యది. వాడికి మనమనుకునే చదువురాదు; లారీ నడపడమూ రాదు.

గౌరి : మరేచదువొచ్చు ?

రామం : డబ్బు సాంపాదించే చదువొచ్చు; దివ్యంగా వచ్చు.

గౌరి : ఇదంతా ఎప్పుడు నేర్చావు కక్కయ్యా ?

రామం : ఇట్లాగే అప్పుడుకొంత, ఇప్పుడుకొంత.

గౌరి : ఇంత తలకిందులుగా ఎందు కాలోచించావు ?

రామం : సరిపోయింది. అడిగావూ. ఆయుష్షు పట్టడిగావే. కష్టా లను మరిచిపోవడానికి ఆలోచించాను. ఆలోచించగా, ఆలో చించగా ఇలా తయారైంది. ఇప్పుడు మనకు జనన మర ణాలు, కష్టసుఖాలు, దేవుడు, దయ్యం — అంతా ఒకటే.

గౌరి : అంటే !

రామం : అంటే అంటే అంతే. అంటే 'జై సీతారాం' అన్నమాట. నాకుగానీ, ఇతరులకు గానీ మంచిజరిగినా, చెడుజరిగినా ఆనందంలేదు; ఆపసోపాలు అంతకంటే లేవు.

గౌరి : అలాంటి వాడివి నాన్న కోసం ఇంత త్యాగమెందుకు చేస్తున్నావు? నా కోసం బావిలో కెందుకు దూకావు?

రామం : చేతనైంది చేస్తున్నాను. చేతకాకపోతే వూరుకుంటాను;

గౌరి : మరి - ఆ గుణమేమిటో ?

రామం : సరిపోయింది. నాకు తెలియందడిగావే. దానికి - మనసు సమాధానం తెలియదే. చిత్తయి పోయాను. అయినా- ఇన్ని ప్రశ్న లెందుకూ? నన్నా నన్నానానా...

కష్టమైనా ఒక్కటే
సుఖమైనా ఒక్కటే
అందుకోసం
కష్టపడుటే మంచిరా నన్నా నన్నా

గౌరి : కక్కయ్యా ! ఈ పాటల కర్ధమేమైనా వుందా ?

రామం : నాకైతే ఏంలేదు. తీసుకునే వారుంటే నేనేమీ కాదనను.

గౌరి : నీదంతా చిత్రం కక్కయ్యా.

రామం : సరిపోయింది. చిత్రమూ ! చిత్రమే...నన్నా నన్నా.

రత్తమ్మ: (అందుకుంటూ వచ్చి) ఏం నన్నా నన్నానా రయో రామారం. ఇప్పుడేంపాటలు చెప్పు. అన్నయ్య పడుకోవాలంటుంటేను ఇదేంపని? ఆయన లేచాడో ఏమో.

రామం : సరేలే. ఊరుకుంటాను, ఇదీకథ. (రత్తమ్మ లోపలి కెడుతుంది. కాస్తనిశ్శబ్దం. మళ్ళీ రత్తమ్మ గబగబా వస్తుంది)

రత్తమ్మ: ఇదేమిటయ్యా - అన్నయ్య వొళ్ళంతా దిగచమటలు పోసింది. నాడి ఆడటంలేదు. డాక్టరుగార్ని రమ్మను రామం తొందరగా. తొందగా రమ్మను. (అంతా లోపలికెళ్ళి గొల్లుమంటారు)

రామం : ఏడవకండి.

రత్తమ్మ : [లోపలినుంచే] అయిపోయింది. ఆ కాస్తపనికూడా అయిపోయింది. మంచం దింపండి. డాక్టరుగార్ని రమ్మను నాయినా. రామం తొందరగా వెళ్ళు.

డాక్టర్ : (బయటినుంచి ప్రవేశిస్తూ) నేనిక్కడే వున్నాను. (అంతా హాలులో కొస్తారు)

రత్తమ్మ : (ఏడుస్తూ)వచ్చారా డాక్టరుగారూ! ఆయనకు నాడి ఆడటంలేదు. వచ్చి చూడండి.

డాక్టర్ : అలాజరుగుతుందని నాకుతెలుసు. మీరెవరూ ఆయన్ను తాకకండి. (చాలా సీరియస్‌గా) ఆయన్నెవరు చంపింది కూడ నాకు తెలుసు.

అంతా : (ఆశ్చర్యంగా అలాగే నిలబడిపోయి) చంపడమా!

డాక్టర్ : అవును చంపడం. ఈ పరిస్థితుల్లో, ఈ ఇంట్లో చావడం, చంపడం అంత ఆశ్చర్యం కాదు. (గౌరి లోపలకెళ్ళబోతుంది) అమ్మాయిగారూ! ఎవరూ కదలొద్దు. (అంతా అలాగే గుడ్లనీళ్ళు

కుక్కుకుంటూ నిలబడిపోతారు; రామం మాత్రం తాపీగా చుట్ట కాలుస్తూ పక్కగా నిలుచుంటాడు)

రత్తమ్మ : మేమే చంపామంటారా ?

డాక్టర్ : ఆయన బాధపడలేని వారెవ్వరైనా చంపవచ్చు.

రత్తమ్మ : ఏమిటండీ ఇది? ఎవరు చంపారంటారు?

డాక్టర్ : ఎవరో- మీరే చెప్పాలి. నా నోట చెప్పించవద్దు. (అంతా ఒకరి మొహాలు ఒకరు చూసుకుంటారు) ఊఁ. ఎవరూ మాట్లాడరేం?

రత్తమ్మ : ఇదేం అన్యాయమండీ నేను కాదు.

గౌరి : నేను కాదు.

బాబు : నేనెందుకైంది ?

డాక్టర్ : మరెవరు ?

రామం : (తాపీగా) నే నండీ.

అంతా : (రామంవైపు చూసి) నువ్వా!

రామం : అవును.

డాక్టర్ : మీరెవరూ కాదు. నేనే చంపాను భద్రయ్యగారిని.

అంతా : (ఆశ్చర్యంగా) మీరా !

డాక్టర్ : అవును. నేనే, వారు పదేపదే కావాలన్న గోళీ ఇచ్చాను.

రత్తమ్మ : వారేదో కష్టపడలేక అంటే మీరలా ఇస్తారా?

డాక్టర్ : ఇస్తేనేం? ఈ లోకంలో ఆ మనిషి ప్రాణంపోతే ఎవరికి సానుభూతి ? ఆయన ప్రాణం సంగతి ఎవరికి పట్టింది ?

ఆయన బ్రతుకు సంగతి ఏ సమాజానికి పట్టింది? ఆయన ఆరోగ్యంగా ఉన్నన్నాళ్ళూ - మీరూ, నేనూ, లోకం ఏదో విధంగా సహాయం పొందడం జరిగింది. ఆయన ఆరోగ్యంగా వున్నప్పుడు — వెంకట్రావుగారు, తన కొడుక్కి ఈమెను చేసుకుంటానన్నాడు. ఆయన మంచిగా వున్నన్నాళ్ళు - ఆయన అన్నగారూ పిల్లలతోసహా ఈఇంట్లో కడుపులో చల్లకదలకుండా మేశారు. ఆయన పుష్టిగావున్నన్నాళ్ళు వందలాది పిల్లలు చదువుకొన్నారు. పిల్లలతండ్రులు తమ పిల్లలకు మార్కులెయ్యమని బతిమాలుతూ ఇంటిచుట్టూ తిరిగారు. బళ్ళో వ్యూనులు వంగివంగి దండాలు పెట్టారు. భార్యా బిడ్డలుగా మీరంతా సుఖపడ్డారు.

వారు మూలబడ్డారు.ఆ తరువాత వారిసంగతి ఆలోచించిన వారెవరు? వెంకట్రావుగారు గౌరిని - తనకొడుక్కి చేసుకోడానికి వంకలుపెట్టారు; అన్నగారు ఏదోసాకుచూపె తగాదా పెట్టుకొని వేరుపడ్డారు; విద్యార్థులు పైచదువుల కెళ్ళిపోయి - గురువుగారి సంగతే మరిచిపొయ్యారు. ఒక్కరైనా వారీ స్థితిలో ఎలాబ్రతుకుతున్నారనీ, అనారోగ్యంలో వారిజీవనం ఎలాసాగుతున్నదనీ ఒక్కరైనా ఆలోచించారా? రెక్కల కష్టమ్మీద ఆధారపడ్డవారి బ్రతుకు మధ్యలో ఇలాబండలయితే ఏమవుతుందో ఒక్కరైనా ఆలోచించారా? మీరాలోచించరు; సమాజం ఆలోచించదు: నేను ఆలోచించను. ప్రభుత్వం ఆలోచించదు; చివరకు దేవుడైనా ఆలోచించడు. ఇంకా వారీ లోకంలో ఎందుకుబ్రతకాలి? తన సేవలను చేయించుకొని - ఆపదలోఅక్కరపడక కృతఘ్నతచూపే సమాజంలో ఏందుకు

జీవించాలి? ఏం సుఖముందని? అవస్థలతో, అవమానంతో అస్తమానం ఎందుకు వెళ్లాలి? ఆయన అలా అయ్యాడనేగదూ భార్యగా మీరు రాత్రింబవళ్లు కష్టపడుతున్నారు? అందుకనే గదూ - గౌరికి పెళ్ళికాంది? అందుకనేగదూ - బాబు కిళ్లీ కొట్లో కూర్చుంది? అందుకేగదూ - రామం లాటి డ్రైవరుకూ వళ్ళివచ్చింది? లేకుంటే - ఇలా జరగవలసి వుండేదా? ఒక్కరిమీద ఆధారపడ్డ ఈ సంసారం - అసలువాడు మూలపడితే - ఇంట్లో - అభివృద్ధికి రావల్సిన ఇంతమంది ఎందుకు కష్టపడాలి? ఇదేనా సమాజపరిస్థితి? కష్టాలుపడుతుంటే అవమానపరిచే సమాజంలో, అవస్థలుపడుతుంటే హేళనచేసే లోకంలో, బాధలుపడుతుంటే అలాగే చూసే మనుషుల్లో బతికేకంటే - హాయిగా చనిపోవడమే అన్నివిధాలాఉత్తమం. అందుకే నేనాపని చేశాను. నేనీపని చేయడం పాపమే కావచ్చు. కాని - నేనీపని కావాలనేచేశాను. ఆయనపడేబాధను చూడలేక చేశాను; ఆయన వ్యధకు తట్టుకోలేక చేశాను; ఆయన వేదనకు కన్నీరు కార్చి కార్చి ఇలాచేశాను. ఈపాపానికి తగిన శిక్ష అనుభవించడానికి నేనుసిద్ధంగావున్నాను.

భద్రయ్య : (లోపల్నుంచి) బాబూ! నాయినా!

బాబు : (అంతా ఆశ్చర్యంగా అటు చూస్తారు) అదేమిటే - నాన్న లేచాడు. (గబగబా లోపలికి వెడతారు. రామాన్ని డాక్టరు ఆపుతాడు)

డాక్టర్ : రామం! (పిపునిమరి) ఈ లోకంలో నువ్వొక్కడివేనోయ్ సరియైన వాడివి.

రామం : సరిపోయింది. ఏమిటండీ ఈ చిత్రం.

డాక్టరు : భయంలేదు రామం. మీ అన్నగారికేమీ ప్రమాదంలేదు. (అంతా భద్రయ్యను హాలులోకి తీసుకొస్తారు. భద్రయ్య కుర్చీలో వాలుతాడు)

భద్రయ్య: నేను నిజంగానే ఆగోలీ అనుకున్నాను

డాక్టరు : భద్రయ్యగారూ! నిజంగా మీకాగోలీ కావాలని వుందటండీ ?

భద్రయ్య: (ఇలా అడుగుతాడనుకోక ఆశ్చర్యపడి)అఁ. ఆలోచించుకో నివ్వండి.

డాక్టరు : ఎవరికీ బతుకుమీద ఆశపోదు భద్రయ్యగారూ! అదే సృష్టిచిత్రం.

భద్రయ్య : ఎమిటండీ ఈ నాటకం ?

డాక్టరు : (భద్రయ్య కాళ్ళుపట్టుకొని) క్షమించండి భద్రయ్యగారూ! జరిగిందేమిటంటే - మీరు నిద్రపోవడానికి మందిచ్చాను. అసలే అలిసి పొయ్యారుగనుక - నిద్రపట్టేసరికి మరీ చెమటలు పోసి వుంటాయి. మీకష్టాలు చూడలేక — ఏదో ఉద్రేకంలో ఇలా మాట్లాడేశాను.

భద్రయ్య : నిజంగా మీరాగోలీ ఇవ్వాల్సింది.

డాక్టరు : ఆ గోలీ ఇవ్వడానికి నేనెవర్నండీ మీకూనాకూ, అందరికీ అవసరమైనప్పుడు ఆయనే ఇస్తాడు గోలి. ఏదోమనస్సు పటకలే ఇవ్వన్నీ ఇవ్వడం.

రత్తమ్మ : మరి - ఇదంతా ఏమిటండీ ?

డాక్టరు : చెప్పాకదండి. ఆస్థితిలో అలాచేశాను. ఏం చేయను ?

రత్తమ్మ : హాడలగొట్టారు.

డాక్టర్ : అంతేగాని - కష్టాలయితే పోగొట్టలేక పొయ్యాను. ఇది గొండి - ఈ గోలీ మింగండి భద్రయ్యగారూ !

భద్రయ్య : మళ్లీఅదేనా డాక్టరుగారూ ! ఎంత సేపూ మీమందే మీరు గాని - నాకాకావల్సిన మందివ్వరుగదా.

డాక్టర్ : ఇదంతేలెండి. (రత్తమ్మ చేతికిగోలీ ఇచ్చి) మింగించండి... వస్తామరి. (వెళ్లబోతాడు)

రామం : డాక్టరుగారూ ! నేనోమాటంటాను - మీకు కోపంరాదు గదా ?

డాక్టర్ : ఒకరికి కోపమొస్తుందని నువ్వుఆగే మనిషివి గనుకనా ? అనే మాటేమిటో అను.

రామం : ఎవరూ సహాయం చేసేవారులేరని అంతగా అన్నారే. మీ వరకు మీరేంచేశారు డాక్టరుగా కాకుండా.

డాక్టర్ : రామం. నిజంగా నువ్వింత తెలివైనవాడివనికూడా ఇప్పుడు తెలుసుకున్నాను. అయితే - నేనే అందామనుకున్నమాట నువ్వే అడిగావు. నాకే కోపమూలేదు. తప్పకుండా నాసాయ మొకటుంది. అది నీద్వారానే ఈకుటుంబానికి చేయదలచాను. పాతోవచ్చెయి. అన్నట్టు - మీ వేణు ఎక్కడ చదువుతున్నా రన్నారు?

రామం : నేనుచెబుతాగా ....ఒక్క క్షణం. పీకెతడుపుకొని వస్తున్నా.
నన్నా నన్నానానా...

(చుట్టకాల్చి - రామం - డాక్టరుసంచి తీసుకొని అయన్నను సరిస్తాడు. రత్తమ్మ భర్తనోట్లో మాత్రవేస్తూ వుంటుంది)

- తెర -

# ఉంగరాల వేళ్లు

## సరదా ఫిల్మ్స్-ఆఫీసుగది

[ఒక టేబులు, సోఫాలూ, కుర్చీలూ వుంటాయి. గోడలకు ప్రముఖ సినిమాతారల చిత్రాలుంటాయి. టేబులుమీద కొన్నిసినిమా పత్రికలు, వ్రాసుకోడానికి అవసరమైన పరికరాలు, ఫ్యాన్, ఫోను వుంటాయి. తెరతీయగానే - డైరెక్టరు రావు, అసిస్టెంటు మధుకొన్ని కాయితాలతో హుషారుగా ప్రవేశిస్తారు]

మధు : తప్పదు. ఎలాగైనా తప్పదు. మనచిత్రం బయటపడ్డాక - ప్రజలంతా మూర్ఛపోక తప్పదు.

రావు : ఏమిటంతగా మురిసిపోతున్నావు ?

మధు : మురిసిపోవడమేమిటి సర్. ఇంకా - ఆ నా కనబడని లోపలి హృదయం ఎంత ఆనందంతో వుబ్బితబ్బిబ్బై "కళాప్రపంచం" లో అలా అలా తేలిపోతున్నదో మీరేం కనిపెట్టారు ?

రావు : చిత్రం అంతగొప్పగా వుంటుందంటావా ?

మధు : నే ననడమేమిటి ? ప్రజలు, ప్రభుత్వం, పత్రికలు, కవులు, రచయితలు, జర్నలిస్టులు, విమర్శకులు, పిన్నలు, పెద్దలు, వృద్ధులు....ఇంతెందుకూ ? పిపీలికాది బ్రహ్మపర్యంతం అంతా మనచిత్రానికి బ్రహ్మరథం పట్టారంటే పొగడ్తనుకోకండి. ఏమన్నా అనుకోండి - వున్నమాట నేస్తున్నాను. మనంతీసిన మూలవిరాట్, ముత్యాలవనం, ఉగ్రసేన, ఊహాతీతం, శ్రీమద్రామాయణం, శివపురాణం, కాశీమజిలీ. కనకదుర్గ, కల

గూరగంప, కనకవర్షం—ఈ చిత్రాలన్నీ దీనికిందే చలామణీ
రంచే నమ్మండి.

రావు : ఆఁ. అంత బావుంటుందంటావు!

మధు : అలా అనొద్దంటే నోరుమూసుకొని పడుంటాంగానీండి.... నా
లోని ఆ కళాపిపాస.... అలా కట్టలు తెంచుకొని ప్రవహిస్తున్న
విషయం, కన్నవిషయం - కాలహరణంలేకుండా కచ్చితంగా
చెప్పేయ్యమని ఫోర్సు చేస్తున్నప్పుడు నేనాగలేను; ఏమాత్రం
ఆగలేను. అయినా కంట్రోలు చేసుకోడానికి ప్రయత్నిస్తాను.
మొహంమెదుట మెచ్చుకోకూడదు. నిజమే.

రావు : మనం మెచ్చుకోగానేకాదు, అసలు కవిగారు మెచ్చుకోవాలి.

మధు : మెచ్చుకోకపోతే ఆయన కవిగాదు. 'కాకి' అనేస్తానంతే.
అంతటి మహత్తర సన్నివేశాలు, మహోజ్జ్వల ఘట్టాలతోనిండి,
తొణికిసలాడుతూ, పొంగిపొంగిపోతున్న మన అఖండ చిత్ర
రాజాన్ని మెచ్చుకోకపోతే అది కళాహృదయంకాదు. కఠిన
పాషాణమన్నా ఏమాత్రం దోషంలేదు.

రావు : ఎలాగయినా కొద్దిమార్పులు జరిగాయి గనుక...

మధు : మార్పులంటే.... బాగుందే - మనకోసం చేశామా ?.... సినేరి
యోకోసం, టెంపోకోసం, క్లయిమాక్సుకోసం, మ్యాసప్పి
లింగుకోసం.ఎన్నయినా మార్పులుచెయ్యొచ్చు. వద్దనేదెవరు?
ఆమాటకొస్తే ఉల్టా సీదా అయితేమాత్రమేం తప్పు ?

రావు : అదే ఆయన నోటిమీదుగావస్తే మనం ధన్యులమైనట్టే.

మధు : ఆయన వొప్పుకోకపోతే నేనొప్పిస్తాను; లోకం చేత వొప్పిస్తాము.

రావు : వారిరాక కింతాలస్యమై పోయిందే. ఫోన్ చేశావుగా ?

మధు : చేశాను. అప్పుడే చేశాను. బయల్దేరు తున్నామని జవాబొచ్చింది.

(అంటుండగానే కవిగారు ప్రవేశిస్తారు)

రావు : అదిగో—మాటల్లోనే రానే వచ్చారు. కవిగారికి నిండా నూరేళ్ళు.

మధు : అన్ని సంవత్సరాలు ఒట్టిగా జీవించడం కాదు; బ్రహ్మాండమైన కీర్తితో.

కవి : ఏమిటివాళ—అసిస్టెంటుగారేమో మహా సంతోషంగావున్నారు?

రావు : కవులు కనిపెట్టాలిమరి—ఆఁ...కూర్చోండి. (సోఫాలో కవి కూర్చుంటాడు).

కవి : ఆఁ. సినేరియో ఎంతవరకొచ్చింది ?

మధు : ఎంతవరకేమిటి? మన పెట్టుబడిపోను—అయిదులక్షల లాభం వరకొచ్చింది,

కవి : ఏమిటి గిరాకీ ?

రావు : గిరాకీ ఏముంది? పూర్తయింది. చాలాగొప్పగా తయారైందని మన మధు అంటున్నాడు.

మధు : నేననడమేమిటి? ముక్కోటి ఆంధ్రులు నో నో.......ముప్ఫై మూండుకోట్ల భారతీయులు ఏక్స్క్యూజు మీ....ప్లస్ పదికోట్ల

పాకీస్తానీయులూ, ఊఁహూఁ.... అలాఅన్నా లాభంలేదు; యావత్ప్రపంచం—అంతకన్నా మంచిపదం "కళాప్రపంచ" మంతా హారతులు పడ్తుందని ఘంటాపథంగా నొక్కి వక్కాణిస్తున్నానంతే.

కవి : అబ్బా.... అంత గొప్పతనమే. ఏమిటావిశేషం చెబుతారా?

రావు : ఆఁ. విశేషమేముందీ? కొద్దిపాటి మార్పులుచేశాం - అంతే. ఇక దాంతో....

మధు : ప్రజలకోసం, వాస్తవిక జగత్తుకోసం, క్లయిమాక్సుకోసం, కళాపోషణకోసం, మాంచేన్ పాట్లకోసం, సింబాలిజంకోసం, సినేరియోకోసం....

రావు : ఏమంత పెద్దవికావులెండి. మీరు శాస్త్రజాగ్రత్తగా ఆలోచిస్తే అదేమంత గొప్పమార్పు లనిపించవు.

కవి : మార్పులవసరమని నాతో చెప్పారుకారేం? అయినా భావం చెడకుండా కొద్దిపాటి మార్పులయితే ఫర్వాలేదుగానిండీ. అసలు సెంట్రల్ ఐడియాయే ఖూనీ అయిపోతే కష్టంగాదూ?

మధు : ఎబ్బెబ్బె... ఈమాత్రం మన రావుగారికి తెలియదటండీ? అలాంటిదేమీరాదు, ఇంకా కథకుఎక్కువ రసపుష్టి, అంద చందాలు చేకూరాయి.

కవి : అవేమిటో విని కొద్దిగా నన్నుకూడా మీసంతోషంలో పాల్గొన నివ్వండి.

రావు : ఆఁ. మీరు దానికి దేశభక్తుడు అనికదండీ — నామకరణం చేశారు ?

కవి : అవును.

రావు : అసలు మనం గాంధిపేరుతో నైతేనేగా చిత్రానికి గొప్పఖ్యాతి వస్తుందనుకున్నాం.

కవి : నేనెప్పుడూ ఇలా అనలేదు. అయినా, గాంధీ పేరుకుకాదు గొప్పతనం; ఆయన సిద్ధాంతాలకు.

మధు : పేరులేకుండా సిద్ధాంతాలేమిటండీ—మీదో వెర్రిగాని.

కవి : అందుకని........

రావు : అందుకని...మీరుంచిన "దేశభక్తుడు" అనే పేరునుమార్చి— "బాపూజీ" అని వుంచాం.

కవి : అయ్యయ్యో...చంపేశారండి. అసలదెలా సరిపడుతుందండీ? భావం చెడదూ? దేశభక్తుడంటే బాపూజీ సిద్ధాంతాలనునమ్మి, అమలుజరిపి, దేశాన్ని శాంతంగా సత్య, అహింసలవైపు పురోగమింపజేసే శాస్త్రజ్ఞుడు. ఇక మీరుంచినపేరు ఎలా సూటవుతుందో తోచదు.

మధు : దానికితగ్గట్టు మరికొద్దిగా మార్చామనుకోండి. అయినా ఆ పేరుతో ఎంత జనమొస్తుందో చూశారూ? అప్పుడు చూసోక్కండి. మనపేరు తడాఖా;

కవి : నా భావాలనూ, ఆదర్శాలను ఖూనీచేసేసారంతే. అసలు పేరుకూ, కధకూ సంబంధ మేమాత్రముండదంటే కోప్పడకండి.

రావు : ఏం ఫర్వాలేదు. మీరంతా వినకుండానే అభిప్రాయాన్నిస్తున్నారు. పూర్తిగావింటే సరేననకపోరు. మన కధానాయకుడు గాంధీభక్తుడేగా ?

కవి : భక్తుడంటే మూఢంగా నమ్మేవాడు కాదు. హేతువాదంతో ఆ సిద్ధాంతాలను అర్థంచేసుకొన్న విజ్ఞాని.

మధు : అందులో తవ్వుడుతింటూ వయ్యారమేమిటండీ. ఆకాస్తా భక్తుడంటే మన ముళ్లెంపోతుందీ ?

కవి : ఎలా అంటామండీ?

రావు : కాస్తమీరు నిష్పాక్షికంకా, శ్రద్ధగావింటే అన్నీ అర్థమవుతాయి. పోనీ నేచెప్పనా - అతన్నెలా భక్తునిగా మార్చానో? అతనొక 'బాపూజీ"అని గాంధీ దేవాలయాన్ని కట్టిస్తాడు.

కవి : చంపేశారండీ....ఆమాటంటేనే గాంధీగారొప్పుకోరు. అదేం పనండీ.

మధు : ఆఁ...ఆయనొకరుంటేగా ఒప్పుకోవడానికి.

కవి : బ్రతికున్నప్పుడే చెప్పారు.

రావు : అయినా—నీ దేవాలయము నిర్మించి, పూజిస్తామని అడిగితే అలా చెయ్యొండనెవరన్నా అంటారటండీ ? మనకు భక్తివున్నప్పుడు అలా చెయ్యాల్సింటే, దానికిమళ్ళీ అడగడాలు, పెట్టడాలేమిటి అసహ్యంగా?

కవి : అలాగని—ఆయిన సిద్ధాంతాలకే విరుద్ధంగా వర్తిస్తారా?

మధు : ఇందులో విరుద్ధమేముందండీ? హాయిగావుంటుంది. దేవాలయం, జనంరావడం, భజనలు, కోలాటాలు, ఓ 'ఫోక్ లోర్ సాంగ్' గుమ్మయిపోతుందిలెండి.

కవి : అసలు మన కథానాయకుడికి గుడికట్టించేంత దక్పైక్కడచచ్చిందండీ?

రావు : తొందర పడ్డారేందుకూ? మన కథా నాయకుడు—ప్రజలనాయకుడుగా? ప్రజలడబ్బుంటుంది. రామదాసులాగా కొంతడబ్బు తీసి గుడికట్టిస్తాడు. అప్పుడు ప్రజలతన్ని జైలుకుపంపుతారు. ఇక చూచుకోండి. జైలుసీను, ఖైదీలపాట భలే బాగుంటుం దంటేనమ్మండి.

కవి : ఇంకెందుకూ? అర్థమైంది. జైలుబాధలు భరించలేక మన కథానాయకుడు విషం పుచ్చుకోబోవడం, గాంధీ ప్రత్యక్షమై డబ్బివ్వటం, పబ్లిజలాభక్తునిగుర్తించి కాళ్లమీదపడటం, విడుదల చేయడం, కథానాయకుడు గొప్పవాడు కావడం, అంతేగా మీమార్పులోని ఆంతర్యం?

మధు : ఒహో. ఇంకెందుకూ ఎక్జాక్ట్ లీదట్. మీరు చాలావరకు బాట కొచ్చారు. మరి చూచారూ—ఎంతగొప్ప సన్నివేశమో. గాంధీ గారి అవతారాలను రంగురంగుల్లో చూపిస్తుంటే ప్రజలునోరు తెరచి నిశ్శబ్దంగా చూస్తుండటం అవ్వన్నీ నాకళ్లముందిప్పుడే ఆడుతున్నాయి. ఓ ఛాలావండర్‌ఫుల్.

కవి : వండర్‌ఫుల్ కాదు వరెస్టంటేనమ్మండి.

మధు : మీరీవేళ అనగానేసరా. ఆవేళ ప్రజలుబండ్లుకట్టుకొని తండో పతండాలుగా వచ్చేనాడు చూడాలి.

కవి : ఇక చూడాల్సిందే—నా మొహం.

రావు : ఈమాత్రం మార్పులకే ఇంతచింతపడితేఎలా — పబ్లిజాభిప్రాయాన్ని తీసుకోవాలిగాని,

మధు : పాపం వారికివ్వన్నీ యేంతులుసు.

కవి : ఏమి తెలియంది నాకథెందుకుమరి ?

రావు : మీకు ఎన్ని తెలిసినా కొన్నియిలాంటి వాస్తవవిషయాలు తెలుసుకోవాలండీ. ఇవి తెలుసుకోవాలంటే మీరి యంత్రపరిశ్రమలో కొన్నాళ్ళు మెలిగాక దానంతటదే తెలిసిపోతుంది. మీరిప్పుడే ఫ్రెష్‌గా యిందులో దిగుతున్నారా—అంతా కొత్తగానేఉంటుంది. అలాగని చికాకుపడకూడదు.

కవి : నీకేమయినా కొత్తగాఉందేమోగాని నాకేమీ లేదులెండి. అలాగనుకొని నన్నూ నాసిద్ధాంతాలను నుగ్గునుగ్గు చేశారు.

మధు : సిద్ధాంతాలెప్పుడూ ఒకరకంగా ఉంటాయామరి? కాలాన్ని బట్టిమారాలి. మారకపోతే మార్చాలి. ఫరెగ్జాంపుల్: గాంధిగారి సిద్ధాతాలంటూ నిరాడంబరంగా జీవిస్తేఎలాచెప్పండి?

కవి : అలాగని......

రావు : అలాగని వూరుకోక మన కథానాయకుడిచేత ఖాదీ సిల్కుసూట్లు వేయించేశామంతే.

కవి : పడిచినట్టుంది. పైగా అదొహాట్రా? సిల్కుసూట్లకూ, వాటికీ యింకాడబ్బెక్కడ తగలడిందండీ?

మధు : అందుకనే ఎన్నికలు పెట్టాంగా—ఎన్నికలు. ప్రతినిధినుండి మంత్రిదాకా పెట్టించాం. ఎన్నికలఘట్టం—జనం ముఠాలు ముఠాలుగారావడం, తిట్టుకోవడం, ప్రచారాలు చేసుకోవడం కరపత్రాల యుద్ధాలు—యివ్వన్నీ భలేమజాలెండి. మననాయకుడు మంత్రి అవుతాడు. ఇక—డబ్బా, కార్లకేంకొదవ?

కవి : అసలు మన కథానాయకునికి ఎన్నికలంటేనే యిష్టంలేదు ఏదైనా చేతనైన సేవ చేస్తాడంతే.

రావు : అంత అనాగరికుణ్ణి నాయకునిగా చేస్తే ఎలాగండీ? ఎన్నికలు లేంది పరిపాలన ఎలాగు ? మీరన్నట్టుంచితే - అతన్ని రాతియుగపు మనిషనుకునే దురభిప్రాయం కలుగుతుంది. అందుకోసం మామూలుగావుండే ఎన్నికలకోలాహలముంచాం. భలే రక్తిలెండి. ఇక హరిజన బాలికను పెంచుతాడన్నారు కదూ?

కవి : అవును.

మధు : అదికూడా చాలా గొప్ప సీనులెండి. మీరేదో మామూలు పద్ధతిలో ఒక చిన్నమ్మాయిని పెంచుతున్నట్లు వ్రాశారు. అదేం బాగనిపించలే. అందుకోసం, యిలా మార్చారు; మన కథానాయకుడు కట్టించిన గుడి వుంటుంది చూశారూ ? అందులోకి– వూళ్లోవాళ్లు కొందరుచేరి హరిజనులను లోపలికి రానివ్వరు. అప్పుడు మన నాయకుడు వాళ్ల నెదిర్చి హరిజన ప్రవేశం చేయిస్తాడు. హరిజనుల పాట ప్రత్యేకంగా వుంటుందంటే నమ్మండి. వాళ్ల వాయిద్యాలూ, ఆటలూ, నృత్యాలూ. యివ్వన్నీ– ఓ!

ఇలా హరిజనులు వస్తుంటే–ఒకరోజు ఒక 'విలన్'గాడు-ఒక హరిజన బాలికను బలాత్కరిస్తుంటాడు. అప్పుడా అమ్మాయి రక్షించమని ఆగుడిలో పాటపాడుతుంటుంది. ఇంట్లో వున్న మన నాయకుడికి గాంధీగారు కలలో కనబడి వెంటనే ఆ అమ్మాయిని రక్షించమని చెబుతాడు. అప్పటికప్పుడు నాయకుడు వచ్చి ఆ 'విలన్'కు బుద్ధిచెప్పి అమ్మాయిని రక్షిస్తాడు.... ఆ అమ్మాయి యుక్తవయస్కురాలు.

కవి : అయితే యెంకేం? దీన్ని ప్రేమఘట్టంలోకి దించివుంటారు.

రావు : దట్స్ ట్రూ. ఇంకా దించడమేమిటి ? దిగించకూడాను. రొమాన్స్ లేని పిక్చర్ యేమిటండీ? బోలెడు ప్రణయాన్ని మనం చూపొచ్చు. అలా - వారిద్దరికీ సహవాసం యేర్పడుతుంది.

మధు : ఇక అక్కడ్నుంచి కథ మాంచి సస్పెన్సులో వెడుతుందనుకోండి మన నాయకుడు కష్టాలు పడుతుంటాడు.

కవి : కష్టాలుకాదు. కనరాని, వినరాని కల్పనలో పడుతుంటాడు.

రావు: ఎక్సే. అలా కాదు. చివరకు కష్టాలన్నీ కడతేర్తాయి. మానవ మాత్రుడు గనుక ఆ అమ్మాయితో చేసిన స్నేహం గర్భం దాల్చేదాకా పోతుంది. ఆ అమ్మాయి తల్లి దండ్రులు తమ కూతురును పెళ్లి చేసుకోమని మన నాయకుడుని ఒత్తిడి చేస్తారు. తనకో భార్య వుందాయె, ఎలా వివాహమాడ్తాడు ? అందుకని చాలా బాధపడ్తాడు.

కవి : వాడి మొహం బాధ. ఒకప్రక్క మంత్రేమిటి? మరో ప్రక్క ఈ పిచ్చి పనులేమిటి ?

మధు: మంత్రి మాత్రం మనిషి కాడా యేమిటి? ఇంకా అంతటితో వూరుకున్నాడా ? ఒక పెద్ద లంచం తీసుకుంటాడు.

కవి : ఆహాం. లంచగొండితనంకూడా ఉందీ. ఇంకేముంది ! కొంప్రాణంకూడా తీసేశారు.

మధు: ఏం ఫర్వాలేదు మనరావుగారు అన్ని విషయాలు భలేగా డీల్ చేశారులెండి. అప్పటి ఘట్టమెంత గొప్పగా వుంటుందో

చెప్పనా? ఒక ప్రక్క లంచం తీసుకోవద్దని హృదయం అద్దంలో చెబుతుండటం, తీసుకోమని భార్య ఒత్తిడి చేస్తూ వుండడం... ఈ రెంటిని చూపుతాం. ఆసీనులో లంచం తీసుకోవడమే నెగ్గుతుంది?

కవి : ఎంత ఘోరం చేశారండీ? ఏడుపొకటే తక్కువ.

రావు : ఎందుకండీ? మనిషికి కష్టాలు బాగా వస్తేగాని రాణింపుకు రాడు. అందుకని ఒకదానివెంట ఒకటి సృష్టించాను. ఇక లంచం తీసుకొన్నది రుజువై మంత్రిత్వం పోతుంది. అప్పుడు ప్రజలూ హారిజనులూ మనదేశభక్తుని ఇంటిపై బడ్డారు.

కవి : అయ్యయ్యో. మొత్తానికి భలే దేశభక్తుని సృష్టించారులెండి.

మధు: లోకంలో వున్న విషయం చూపాను. తప్పేముంది?

కవి : అయితేమాత్రం అది తప్పని మన మంటున్నాంగా ?

రావు: అంతా చేసేపనిని కాదనడానికి మన మెవరం ?

కవి : అయితే ఇక మన గొప్పతన మేముంది? చిత్రంద్వారా చూపే నీతి, సందేశాలేవీ ?

మధు: ఎందుకు లేవూ ?

కవి : ఏమిటవి ?

రావు: మన నాయకుని దేశభక్తునిగా చూపిస్తున్నామా లేదా ?

కవి : ఇదేం దేశభక్తండీ? దొంగభక్తుడు.

మధు: దొంగో, గింగో. అసలు దేశమ్మీద వున్నదిపీడు. అయినా మంచివాడనే పర్యవసానాన్ని మొదట్లోనే చూపుతామటండీ? ముందు కొన్ని కష్టాలు పడాలి. వాటికి కావలసిన వాతా వరణాన్ని సృష్టించాలి; తర్వాత నెమ్మదిగా ఆ కష్టాలనుండి విడదీయాలి. అదీ గమ్మత్.

కవి : తప్పుడు పనులు చేయించి కష్టాల్లో ఇరికించడమెందుకూ? మంచిపని కేమన్నా పూనుకుంటే కొన్ని కష్టాలుంటాయి గాని.

రావు: అదే తప్పు పద్ధతంటాను. మంచిపనులు చేస్తే కష్టాలేమున్నా యని? అంతా 'ఇంకా సేవచెయ్యి నాయనా' అంటారు. అయినా మంచిపనిచేస్తే కష్టాలొస్తాయంటే ఒక్కడూ దాని జోలికే పోడు. అందుకని "ప్రతివాడూ తప్పుడు పనులు చేస్తూనే వుంటాడు; వాటిని యీదుకొని బైటపడ్డవాడే గొప్పవాడని" చూపాలి. అదీ థియరీ.

కవి : నా కథానాయకుడు అలాంటివాడు కాడు. చక్కని వూహా పోహాలు, ధైర్యం, తెగింపు, నీతి, విశాలహృదయం కల వాడు; శాస్త్రజ్ఞుడు; నిరాడంబరుడు. ఇక మీరు చెప్పే నాయ కుడు శుంఠ, కపటి, అసమర్థుడు, బూటకుడు అవినీతిపరు డంటే కొప్పడకండి.

మధు: మీరు కథంతా వినకుండా ఇలా దురభిప్రాయపడటం మంచిది కాదు. ఇంకావుంది. మన కథానాయకుని యిల్లును ప్రజలూ హరిజనులూ చుట్టుముట్టాక దొడ్డి త్రోవన ఇల్లువదలి అడవి త్రోవ పడతాడు. విచారంగా ఆ ముళ్లకంచెలనూ, పాముల

లనూ, తేళ్లను, పులులనూ, సింహాలనూ చెట్టూ పుట్టలనూ లెక్క చేయకుండా గడ్డమంతా పెరిగి అలాగే పడిపో తుంటాడు.

కవి : ఎక్కడికీ, ఎందుకూ ?

రావు: ఎందుకేమిటి ఇదేగా పశ్చాత్తాప సీను. అక్కడ నాయకు డలా పశ్చాత్తాప పడ్తూం పోతుంటే ఇక్కడ ప్రజలు తమ నాయకుని కోల్పోయి — తమ కోర్కెలు నెరవేర్చుకోలేక కరువు కాటకాలతో క్రుంగి, కృశించి పోతుంటారు. ఇక గత్యంతరంలేక 'బాపూజీ' ఆలయానికెళ్ళి ప్రార్థిస్తారు; సత్యా గ్రహాలు చేస్తారు; ఉపవాసాలు చేస్తారు. 'రాంగ్' మనే పెద్ద సౌండుతో 'బాపూజీ' ప్రత్యక్షమై - 'మీ నాయకుడు ఫలానా అడవుల్లో కష్టాలుపడు తున్నాడని చెబుతాడు. ప్రజలంతా బాజాభజంత్రీలతో, జండాలతో వెళ్ళి మనకథానాయకుని తీసు కొచ్చుకొని హాయిగా కాలం వెళ్లతీసుకుంటారు. ఇదీ కథ. ఏమంటారు. బాగాలేదూ ?

కవి : మళ్ళీ నన్నెందుకు విసిగిస్తారు? అసలీ మార్పులేమిటి ? ఎక్కడి గాంధీ, ఎక్కడి మీదేశభక్తుడు ! ఇదెవరయినా వింటే నవ్వి పోతారు. అసలుఆయనకు గుడి కట్టించడమే తప్పు. ప్రత్యక్షం కావడం మరీతప్పు. అవినీతిపరుని క్షమించడం అంతకంటే తప్పు. ఇన్ని తప్పుల తడకలతో కూడిన మీరు మార్పులు చేసిన చిత్రం... మార్పులేమిటి నా మొహం మీ స్వంత కల్పన నా చిత్రం.... వాస్తవానికి అన్నివిధాల దూరంగా వుంది. దయవుంచి దానికి నాపేరును పెట్టబోకండి.

వు: అదెలా ? మీ రొప్పుకొని తీరాలి.

కవి : అదసంభవం.

మధు: మీరు వ్రాసిచ్చిన కంట్రాక్టు, మీ పేరుకో యిచ్చిన పబ్లిసిటీ, మీ కిచ్చిన డబ్బు - మరచి పొయ్యారా ?

కవి : అంతకైతే మీ పేరే పెట్టుకోండి.

రావు: మా పేరుతోనే కథలు చలామణవుతే మధ్యన మీకు డబ్బు తగలెయ్యడ మెందుకూ ?

కవి : అలాగని ఈ బూతుకథను నా మెడ కంటగడతానంటూరామరి? నే నెప్పుడూ యిలాంటి కథ వ్రాయను.

మధు: అయితే మా డబ్బంతా గంగపాలు చేసుకోమన్నారా?

కవి : కవికి స్వతంత్ర్యంలేని రచనలనెందుకు కోరతారసలు?

రావు: ఏమిటండీ - స్వాతంత్ర్యం, స్వాతంత్ర్యం అని కలవరిస్తారు. మీ రొక కథ వ్రాయగానేసరా? దానిక్కావలసిన సినిమా హంగులన్నీ ఉండొద్దూ ?

కవి : దానికోసం అసలు కథనే ఖూనీచేస్తామంటూరా ?

రావు: ఇది బాగాలేదని ప్రజలన్నప్పుడుగా మీ కథ ఖూనీ అయిందని చింతపడడం.

కవి : ప్రజల కేం తెలుసు, పాపం. అజ్ఞానులుం వాళ్ల కేది చూపిస్తే అదే చూస్తారు.

మధు: వాళ్ల కేమీ తెలియనప్పుడు ఏ కథ చూపితే మాత్రమేముంది ?

కవి : అలాగని అర్థంలేని కథను సృష్టిస్తారా ?

రావు: అర్థమో, గిర్థమో - డబ్బు రానప్పుడుగా అనుకోవడం.

కవి : డబ్బుకేం అడవిసీన్లు, గుళ్లూ గోపురాలూ భక్తి భజనలూ ఉన్నప్పుడు లతులొస్తాయి, దానికేం?

మధు: మరింకా కావాల్సిందేమిటి? ఇది బిజినెస్.

కవి : సిద్ధాంతాలూం బిజునెసేనా?

రావు : అంటే అదేంమ్మాట! మార్కెట్‌లో ఏ సిద్ధాంతాల కెక్కువ డిమాండుంటే వాటికి మనమింకా మెరుగులు పెడ్తూ పోతేనే బిజినెస్ బాగా సాగుతుంది. లేకపోతే ఏలా?

కవి : ఏమిటోఇక మీతో వాదించి లాభంలేదు. నా పేరు మాత్రం క్రెడిట్ టైటిల్సులో వేయించకండి.

మధు: అయితే - మీ కిచ్చినడబ్బు దయచేయించండి.

కవి : ఎక్కడుంది డబ్బు? అలాగైతే కొన్నాళ్ళాగాలి.

రావు: మీ కోసం బిజినెస్ ఆగదు.

కవి : మరి చెరబొమ్మన్నారా?

మధు: చెరెండుకు బోవాలి—చెప్పండి వొప్పుకున్నానని.

కవి : అది నా చేత కాదండీ.

రావు: చేతనయ్యేట్టు చూడాలి తప్పదు-అదిగో పీరస్వామి గారొస్తున్నారు. వారితో చెప్పండి.

[పీరస్వామి, రాఘవులు వచ్చేస్తారు]

పీర : దండాలుండీ డేరెక్టరుగారూ! కై గారు గూడ వుండట్టుండదే. దండం బెట్టుకుంట. కూకోరి రాఘవులుగారూ! కూకోరి.

[అంతా కుర్చీల్లో కూచుంటారు] [డైరెక్టరుతో] ఈరోరో ఎరికేనా. డేరెక్టరుగారూ! రాగోలుగారూ మన సిత్రానికి సగంబడ డబ్బు పెడ్తున్రు. [రాఘవులుతో] రాగోలుగారూ! ఈరేనుండీ మన సిత్రాన్ని డేరెక్టు సేసేదీ. రావుగారంటరు. [అసిస్టెంటును చూపి] ఈరు మదుగారు. డేరెక్టరు గారికి సాయం బడ్తరు.

రావు: అసిస్టెంటండీ. [కవిని చూపుతూ] పిరుమన చిత్రానికి కవిగారు. కరుణాకరంగారు. (ఒకరికొకరు పరిచయ నమస్కారాలు చేసుకుంటారు)

వీర: ఏవుండీ కైగారూ! కతగిట్ట అంత ఘాడ్సుందీ చెప్తిరా?

కవి: నాదేముందీ? అంతా చేసేశామంటున్నారు మన డైరెక్టరు గారు.

మధు: అనడమొకటీ, తయారు చెయ్యడమొకటీనా? అంతా అయిపోయింది; పూర్తిగా అయిపోయింది; బ్రహ్మాండంగా తయారైపోయింది. అంతా బిగించేశాం.

వీర: బిరడా బిగిచ్చినట్టు బిర్రుగ బిగిచ్చిన్రా ఎట్ల?

రావు: అంతేగదండి మరి. చిత్రం ఎంత బిగువుగా ఉంటే అంత రక్తిగా వుంటుంది. అందులోనూ నేను బిగువు తప్పిన చిత్రాన్ని తియ్యనే తియ్యను.

వీర: జాతెరిగని-అంత బిర్రుగబిగిస్తే ఎట్ల పాడైద్ది? మల్ల జర వొదులు చెయ్యాల్నే.

మధు : చంపారు. ఎందుకూ? దాన్నిప్పుడు ఏమాత్రం కదిలించినా టెంపో చెడుతుంది: క్లయిమాక్స్ దెబ్బతింటుంది: ఒక్క మాటలో పాడవుతుంది.

వీర : పాడైతె అయిందిగని, ఈరి బామ్మరిది కత రాసుకోకుంట మీరట్ల బిగిస్తె ఎట్ల పాడైద్ది?

కవి ; వారి బావమరది కథ ఏమిటండీ?

వీర : ఎరక లేదా ఎట్ట? ఆరి బామ్మరిది రేత్రిం బగుళ్లు పొస్తకాలు వోళే సదువుతడంట. దీని కత జర ఆరుగూడ రాయాల్నని పోరాడుతున్నంట.

కవి : ఆ విషయం ముందే చెప్పారు కారేం ?

రాఘ : నేను దీనికి డబ్బు బెడుతున్న ముచ్చట ఆనికే ఎరక. గీమాట వినంగనె ఎగిరి గంతేసిం డనుకోరి. సినిమాకి కత రాయంది ఆడు అనుమంతు కాడంట. ఎడవ సెయ్యితోని గీకుత నంటుండు.

రావు : అదంతా ఇప్పుడెలా కుదురుతుందండీ?

వీర : అదెట్ట. కుదిరిచ్చుకుంటె మీరంతెందుకయ్యా మల్ల?

రాఘ : ఈరసావిగారూ! సిత్రం దీ సేపనిగూడ మా బామ్మరిది కొప్ప గిస్తె కాక పోయిసాది. నాకన్న ఎరక లేదుగని - ఆడు ఇనుంటి సితార్లు లచ్చతోంబై జూసిండంట. ఎడవ సెయ్యితోని తియ్యక పోయినాడు- ఎడవ సెయ్యితోని. అండ్ల మల్ల మైసకు మైస దక్కు; మనోనికి ఫనీ దొరుకు.

వీర : టౌ లేరిగని-ఈరితోని కాయితం రాసుకుంటినిగద. ఎట్టపాడైద్ది?

రావు : వ్రాసుకుంటే ఏమండీ. ఇప్పుడేం కావాలో చెప్పండి. అలాగే చూతాం.

కవి : అదేమ్మాటండీ డైరెక్టరుగారూ !

మధు : మీరూరుకోండి కవిగారూ! మన డైరెక్టరుగారు శాంపో కోసం, క్లయిమాక్స్ కోసం, మ్యాసప్పిలింగ్ కోసం...

కవి : డబ్బుకోసం...

మధు : ఎంతమాట...ఏమైనా చెయ్యగలరు.

రాఘ : ఇదేంది ఈరసాపిఁగారూ! మనకు ఎవురు దిరిగే కైగార్ని బెట్టుకున్నావు. ఇదెట్టాటి పాపం? మా బామ్మరిదిని పెట్టు కుంటె- పైసకు పైసాదక్కు; మావోనికి పనీ దొరుకు. ఆడు ఎడవఁ సెయితోని అల్లకపోయినాడు కత. అండ్ల మళ్ల సెప్పి నట్టల్ల ఇను.

వీర : ఈరుమటుకు ఇనకేం చేస్తరుగని- మరి డేరెక్టరుగారూ! బాగ సెవు కెక్కించుకోరి.

రావు : చెప్పండి చెప్పండి.

వీర : ముందగాల ఈరి బామ్మరిదిగారి సాయం దీసుకోని రాయిల్లాలె. అటెంక— సిత్రంల ఒరోర్ని ఏసం గట్టియ్యాల్నో ఇదోర్కె అనుకున్నం గద.

రావు : అనుకున్నాంగా.

మధు : శాంపోకోసం, క్లయిమాక్స్ కోసం, మ్యాసప్పిలింగ్ కోసం....

కవి : డబ్బుకోసం...

వీర : మీరూళ్ళోకి వెళ్ళగానే!

మధు : పెద్దతారలు కావాలనుకున్నాం.

రాఘు : ఇంతైతే నువ్వు నేను చెప్పేటి మనిస్రైనా ఏం పాపం వీరసామిఁ గారూం!

వీర : ఎట్టి మనుష్య రాగోలుగానే! ఇదేగదా ఇప్పుడు చెప్పేది.

రాఘు : సెప్పేది సెప్పేది. వీర ఆంగ్లైపోయినంక అనుకుంటె కుదరక ఎటువంట్లైంది.

రావు : మళ్లీ ఏమిటండీ అది?

వీర : మన ఈరోయిన్ పసం- బాంగోలుగాని తాలూకు లంబాడిమని సుంటిది— ఆటకు ఆట...

కవి : మని- మూట?

వీర : మీరూళ్లోకి వెళ్లగానా!

రాఘు : ఈరసాఁవిగారూ! ఇసుంటి వైకెని బెట్టుకున్రు-ఇదెట్టాటి పాపం? మా బావమ్మరిదికి సెప్తె ఎడమ సెయితోని అల్లికపోయినాడు కత ?

వీర : బొలేగాని— ఈరేదో అన్నరని మనపూఁకుంటవాగఁని సెప్పరూ డేరెక్టరుగారూ! ఆ మద్దికి ఈరోయిన్ పసం కట్టిద్దాయిఁ. అక్కరబడ్డకాడ లంబాడీ ఆట తొక్కిద్దాయిఁ. ఏంవైతె గారూ! ఆడడ ఆట తొక్కచ్చే పటు బెట్టిన్రా?

కవి : ఇదిగో మన డైరెక్టరుగారు దాన్ని ఎలా చెయ్యాలో అలా చేశారు.

పధు : చేశారంటే వూరికే చేశారా? టెంపోకోసం, క్లయిమాక్స్ కోసం, మ్యాసప్పీలింగ్ కోసం...

కవి : డబ్బుకోసం...

రాఘ : డబ్బు డబ్బంటడు ఈ కయి. ఈన డబ్బు లేకుంటనే రాసిండా ఎట్ల?

వీర : ఊకెనే ఎందుకు రాస్తడు? ఎయ్యిరూపాయలకు కాయితం రాసిచ్చిన; సగంబడ ఇచ్చిన.

రాఘ : ఇంకేమ్మల్ల. అంతక్కైతె మా బామ్మరిదిని బెడ్తె ఎడవండెయి తోని అల్లకపోయినాడు కప, డబ్బుకు డబ్బా కల్సొచ్చు మనోనికి పనీ దొరుకు.

కవి : అదంతా నాదగ్గరెందుకండీ? అలాగే చెయ్యకపోయ్యారూ?

రాఘ : వచ్చే సిత్రానికి కత ఇంగెట్లనైన ఆడే రాస్తడు. రాయండి ఆడు అనుమంతు కాడంట.

వీర : రాగోలుగారూ! ఎట్లనైన ఈ కైగారికి పైసలిచ్చుకున్నం. రాపిచ్చుకున్నం. ఈపాలి కిట్టబోనీరేం? మీ బామ్మరిది ఎటు బడి రొండోదానికి రాసేదేవుండె. ఈపాలి ఎట్టెట్టరాయాలో. ఏం కతతో పైకెల్లి తనికీ జెయ్యవన్ని-ఏవంటారు?

రాఘ : పోన్లేరి. ఈపాలి ఎట్లనో వూకుంటున్న, ఇంగనైతె వూకోను. వచ్చేదాన్కి ఆడు ఎట్లనైన రాయాలె.

కవి : అవును రాయంది ఆయన హనుమంతు కాడుగా.

వీర : మీరూకోరి కైగారూ! ఏవుండి. మరి ఈరోయిన్ ఏసం ఆవె తోని కట్టిస్తాయా?

రావు : హీరోయిన్ వేషమంటే ఎలాగైనా...

రాఘు : నీల్లు నవుల్తాడు. ఇదెట్టాటి పాపం ? మామడ్సి పనికి రాదంటాడా?

మధు : ఎబ్బే కాదండీ. హీరోయిన్ వేషమంటే ఎలాగైనా అటువంటి మనిషి వేస్తేనే మంచిది. కాని - వారికి నృత్యం నేర్పాల్సి వుంటుందా, వుండదా అని రావుగారి ఆలోచన.

వీర : ఇదెట్టాటికత ? అసలు - ఆమడ్సి తోక్కేదే అదాయె. ఇంక నేర్పు డెందుకు ? ఎట్టనైన ఆవెఁ ఈరోజున ఏసంకట్టేది. కట్టేదే.

కవి : చిత్రం ఎలావుండాలో అలా వుండేదే.

రాఘు : ఏం ఈరసామిఁగారూ ! పైసలుపోతె బొయినై గాని ఈ కైగారిని తీసేస్తెనే బాగుండేటట్టుండది. మావోన్ని పెట్టుకుంటే పైసకు పైసదక్కు. మావోనికి పనిదొరుకు.

వీర : ఎట్టనైన ఈకత ఇట్టబోనీం. మరి చూడరూ డేరెక్టరుగారూ! ఇంకో మాటుండది.

రావు : ఏమిటది ?

వీర : ఈ కతల మాసినోనికి జరజాగ జూపిన్రా ?

రావు : మీ చిన్నవాడెవరండీ ?

వీర : మా మంగన్నెరకలే ? మూడోఎక్కం జదువుతుండు. నేనీ సిత్రానికి పైసలు బెడ్తున్ననని ఆడి కెట్టిరకైందో అయిందీ ఇంగ ఏసం ఇయ్యాంది బల్లెకి బోనని ఒకేదూవుఁ జేస్తుండు. ఆనికి జరజాగ జూపుతున్రా ?

రావు : పిల్లవాడా !

రాఘ : పిలగాడాఅని నీల్లు నవుల్తుండు - ఇదెట్టాటిపాపం ! ఈరసామి గారూ ! మూ జామ్మరిదిని బెట్టుకుంటె సెప్పినట్లు ఇనక పోయినాడు ?

మధు : అలాఅని కాదండీ. టెంపోకోసం, క్లయిమాక్స్ కోసం, మ్యాస ప్పీలింగ్ కోసం.

కవి : డబ్బుకోసం.

వీర : మల్లదేమాట — మీరూకోరికై గారూ ! ఏంవటరు డేరెక్టరు గారూ !

రావు : అలాగే చూతామండీ. కాని - ఎక్కడ పెడదామా అని చూస్తున్నాను.

మధు : ఎక్కడేమిటండీ. దేశభక్తునికొక కొడుకును పెడదాం. కాకుంటే ఆయన భార్యకొక పిల్లవాణ్ణి పెడదాం

రాఘ : ఇదెట్టాటికత ? ఒరి పిలగాడైనా ఓటేకాదా! ఎట్ట ?

మధు : క్షమించాలి. పొరపాటులో అలవాటు.

కపి : మళ్లీ ఇందులోనూ పొరపాటేనా ? అలవాటులో పొరపాటు.

వీర : ఏదైతేందిలేరిగని - మరి మావోనికి జరజాగ్రైతె చూహాలె.

రావు : మీరంతగా అన్నాక తప్పుతుందా ?

వీర : ఏంజెయ్యావన్నరు చెప్పురి. ఆడు - తల్లికాడికి బోయి వోటే దూవుం. ఆడు లెస్సు దూవుం జేసడు.

రాఘ : ఆ లెక్కన - ఈరసాంవిఁగారూ! అసలు దూపుఁజేసేపిలగాడే వుండెటట్టుగ అల్లితె ? ఏంకైగారూ!

కవి : ఇక నాపనేమీ లేదండీ. అంతా డైరెక్టరుగారు చూసుకుంటారు. కాకపోతే మీ హనుమంతుగారున్నారుగా,

వీర : ఇప్పుడొద్దులేరి. ఆరు రోండో సిత్రానికి కతఅల్లుతరు. ఏం డేరెక్టరుగారూ! మల్ల - మా సిన్నోని జాగమాశేంది ?

మధు : వేరే చూసేదేమిటండీ. అంతగా కుదరకపోతే ఫ్లేష్‌బ్యాక్ పెట్టి పిల్లవాడిచేత యాక్ట్ చేయింతాం. టెంపోకోసం, క్లయిమాక్సు కోసం, మ్యాసప్పీలింగ్ కోసం.....

కవి : డబ్బుకోసం,....

వీర : : మీరూకోరి కైగారూ! ఇంద మావోనికి జాగజూపుడు గట్టేవా డేరెక్టరుగారూ!

కవి : వారు చూపినా, చూపకపోయినా మధుగారు ఏమైనా చూపుతారు. ఫ్లేష్‌బ్యాక్ పెడతారట- అదెలాసాధ్యమో? అల్లరిచేసే పిల్లవానికి — అల్లరిచేయిని పిల్లవాని పాత్రయిచ్చి ఫ్లేష్‌బ్యాక్ బాగుంది.

రావు : మీకా విషయాలు అంతగా తెలియవు కవిగారూ, అదంతా ఒక పెద్ద టెక్నిక్.

కవి : ఏం టెక్నికో. నా ప్రాణాలు తీశారు.

రాఘ : ఏమ్మాటది ? ఈరికి పైసలు ముట్ట జెప్పిన్నంటిరిగద ఈర సాంవిఁగారూ!

వీర : ఔ — ఇచ్చినగద.

రాఘ : మరి మడిసేవోఁ ఇట్ట మాట్టాడ్తడూ? అంతక్కైతె మాశామ్మురి దిని పెట్టుకుంటె కుదరకపోయినాది ? ఎడవఁసెయితోని గీకక పోయినాడు ? పైసకుపైస దక్కు; మనోనికి పనీదొరుకు.

వీర : అయిపోయిందేమోఁ అయిపాయి. ఈపాలి పైకెల్లి సూడవఁన్రి. సరె డేరెక్టరుగారూ ! ఇయ్యన్ని ఆలోశన జెయరి మల్ల. ఈరితాలూకు లంబాడిమడ్సిని ఈరోయిన్ కట్టిచ్చేదే. మాసినోన్నికి కతల జరజాగ చూపేది చూపేది- ఇంగ మాతమ్ముడు ఈరో ఏసంగడ్త నంటుండు. అదెట్టుంటదో అలెంక జూద్దాయిఁ. వస్తమ్మల్ల శనా పనుండది. రారిరా గోలు గారూ! దండాలుఁడీ. కైగారూ ? దండంబెట్టుకుంటం.

(వీరాస్వామి, రాఘవరావులు వెడతారు)

కవి : ఏమండీ డైరెక్టరుగారూ ! నన్నంటే కాదన్నారుగాని-వారి ముందేమీ మాట్లాడరేమండీ ? అవ్వన్నీ జరిగే పనులేనా?

మధు : ఎందుకు జరగవు? అన్నీ జరుగుతాయి. కథకోసం, టెంపో కోసం, క్లయిమాక్స్ కోసం, మ్యాస ప్పీలింగ్ కోసం...

కవి : డబ్బుకోసం, నామొహం - డబ్బుకోసం....

రావు : కవిగారూ! ఏమనుకొని ఏంలాభం. అఁతా దానికోసం ఏడుస్తున్నవాళ్లమే. నామాటవిని ఏమీ అనుకోక దారికిరండి.

కవి : ఏడుపురాక తప్పేదేముంది లెండి. కానివ్వండి.

- తెర -

# మా ప్రచురణలు

( 1938 - 1941 )

| | | సభ్యులకు | ఇతరులకు |
|---|---|---|---|
| 1. | హైందవ ధర్మవీరులు | 0-4-0 | 0-6-0 |
| 2. | ప్రాథమిక స్వత్వములు | 0-4-0 | 0-5-0 |
| 3. | గ్రంథాలయోద్యమము | 0-4-0 | 0-6-0 |
| | కీ. శే. సురవరం ప్రతాపరెడ్డి | | |
| 4, 5 | కమాల్ పాషాజీవితము (2 భా.) | 0-8-0 | 0-12-0 |
| | శ్రీ ఖండవల్లి బాలేందుశేఖరం. | | |
| 6. | ప్రజలు - ప్రభుత్వం | 0-4-0 | 0-6-0 |
| | కౌంట్ లియో టాల్‌స్టాయి. | | |
| 7. | ఔంధు సంస్థానం | 0-4-0 | 0-5-0 |
| | శ్రీ పులిగడ్డ వెంకట సుబ్బారావు. | | |
| 8. | నా భారతదేశయాత్ర | 0-4-0 | 0-6-0 |
| | ఎచ్. ఎన్. బ్రెయిల్స్‌ఫర్డ్. | | |
| 9,10 | గాంధీమహాత్ముడు (2 భా.) | 0-8-0 | 0-12-0 |
| | విష్ణుచక్రం. | | |
| 11. | కాంగ్రెసు-సంస్థానాలు | 0-4-0 | 0-6-0 |
| 12. | సంస్థాన ప్రజల సమస్యలు | 0-4-0 | 0-6-0 |
| | డా. భోగరాజు పట్టాభిసీతారామయ్య. | | |

( 1953 నుంచి )

| | | సభ్యులకు | ఇతరులకు |
|---|---|---|---|
| | | $12\frac{1}{2}\%$ తగ్గింపు | |
| 3. | జైలులోపల (కథానికలు) | 0-9-3 | -10-00 |
| | శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి. | | |

14. నా గొడవ (గేయాలు) 1–5–0 1–8–0
శ్రీ కాళోజి నారాయణరావు.

15. ఉదయఘంటలు (గేయాలు) 1–15–6 2–4–0
56 అఖిలాంధ్ర కవులు.

16. ప్రజలమనిషి (నవల) 2–3–0 2–8–0
శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి.

17. సెలయేరు (జానపదగేయాలు) 1–8–6 1–12–0
శ్రీ నేదునూరి గంగాధరం సేకరణ.

18,19 జీవన రంగం (15ఏకాంకదృశ్య నాటికలు) 3–1–0 3–8–0
15 గురు రచయితలు.

20. ప్రజలు-ప్రభుత్వం (వ్యాసాలు) 1–1–6 1–4–0
కౌంట్ లియో టాల్‌స్టాయి.

21. పునర్నవం (గేయాలు) 1–3–6 1–6–0
శ్రీ దాశరథి.

22,23 పరిసరాలు (34 కథలు) 3–1–0 3–8–0
34 గురు కథకులు

24,25 తెలంగాణం (32 వ్యాసాలు) 4–3–6 4–12–0
23 గ్గురు రచయితలు.

26. ఆత్మవేదన (గేయాలు) 1–9 న.పై 1–25 న.పై
శ్రీ పొట్లపల్లి రామారావు.

27. తెలంగాణం (3వ భాగం) 1–20 ,, 1–37 ,,
శ్రీఆదిరాజు వీరభద్రరావు.

28. ఆహ్వానము (గేయాలు) 1–31 ,, 1–50 ,,
శ్రీ వానమామలై వరదాచార్యులు.

29. బ్రతుకు బాటలు (కథలు) 1–31 ,, 1–50 ,,
శ్రీ ఎం. హీరాలాల్ రాయ్.

# రాబోవు ప్రచురణలు

1. ఆందోళన (ప్రధాన రాజకీయ ప్రణాళికలు)
2. కూర్చిన ముత్యాలు (ప్రముఖుల ప్రవచనాలు)
3. శ్రీ భాగి నారాయణమూర్తిగారి రచనలు
4. పోతన జీవితము
5. తెలంగాణా కవిమిత్రులు
6. గంగు (నవల)
7. అఖిలభారత తస్కర మహాసభ
8. నాలోనేను
9. ప్రాచీన తెలంగాణా (రాజకీయ, చారిత్రక, ఆర్థిక, సాంఘిక పరిస్థితులు)
10. విజ్ఞాన శాస్త్రము
11. స్త్రీలు-సమాజము
12. బిచ్చిపాపలు (కథలు)
13. సమాజము - వ్యక్తి
14. రైతు రామాయణము
15. తరంగాలు
16. భారతీయ కళావికాసము
17. సామెత కథలు - సామెతలు
18. శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారి రచనలు
19. పరిసరాలు (మూడవభాగం)
20. ఆంధ్రుల రాజకీయ చరిత్ర
21. దేవుని పేరిట (నవల)
22. మీరు - మీపిల్లలు
23. యుద్ధరంగం
24. ప్రాచీన భారతంలో కార్మికులు
25. చారిత్రక గాథలు

# గ్రంథమాలను గురించి

దేశభక్తుడును, ఆంధ్ర ప్రముఖుడును, దేశోద్ధారక, విశ్వదాత, కళాప్రపూర్ణ బిరుదాంకితుడు నగు కీ. శే. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి స్మారక చిహ్నముగా బహుధాన్య సంవత్సరం (1938)లో 'దేశోద్ధారక గ్రంథమాలను' స్థాపించనైనది, కథలు, నాటికలు, కావ్యాలు, వ్యాసాలు, జీవితచరిత్రలు మొదలగు వైజ్ఞానిక గ్రంథాలను ఆంధ్రభాషలో అచ్చువేసి, దేశీయులకు అందజేస్తున్నాము. ప్రతి ప్రచురణము పాఠకుల మన్ననలను పొంది, వారి ఆసక్తిని ఇనుమడింప చేస్తున్నది. మేము పాఠకులనుండి రు. 10-0-0 చందాగా తీసికొని, రూపాయకు రెండు అణాలు హెచ్చింపు ప్రకారం మొత్తం రు. 11-4-0ల వెలగల గ్రంథాలు క్రమంగా అందిస్తాము.

మీరు మా గ్రంథమాల కృషిని గుర్తించి గ్రంథమాలకు చందాదారులై మమ్ము ప్రోత్సహించాలని కోరుతున్నాము.

విన్నవించు

వట్టికోట ఆళ్వారుస్వామి

స్థాపకుడు, ప్రకాశకుడు.

# విరాళాలు

## హైద్రాబాదు జిల్లా

1. డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు (హైద్రాబాదు) 250-0-0
2. గౌ॥ డా॥ బూర్గుల రామకృష్ణారావుగారు ,, 200-0-0
3. గౌ॥ కొండా వెంకటరంగారెడ్డిగారు ,, 125-0-0
4. డా॥ ఎం. చెన్నారెడ్డిగారు ,, 125-0-0
5. శ్రీ వల్లూరు వెంకటేశ్వర్లుగారు, (సుప్రీంకోర్టు అడ్వకేట్) ,, 116-0-0
6. శ్రీ పి. ఆనందరావుగారు (సికింద్రాబాదు) 105-0-0
7. శ్రీ కె. రామచంద్రారెడ్డిగారు (పులిమామిడి) 105-0-0
8. శ్రీ మడూరి రాజయ్యగారి కిష్టయ్యగారి గద్వాల దుకాణం(సికింద్రాబాదు) 116-0-0

## మహాబూబునగరం జిల్లా

1. శ్రీ సోమాగౌడ్ పుల్లయ్యగారు (ఆలంపురం) 400-0-0
2. శ్రీ టి. రాజశేఖరరెడ్డి, శ్రీమతి లక్ష్మీ సరోజినీదేవిగార్లు ,, 125-0-0
3. శ్రీ సురవరం వెంకట్రామారెడ్డిగారు (కంచుపాడు) 116-0-0
4. శ్రీ చెల్లా వెంకట్రామారెడ్డిగారు (పుల్లూరు) 100-0-0
5. శ్రీ కే. వి. భీమసేనరావుగారు (అప్పన్నపలి) [illegible]

6. శ్రీ వి. అనంతసేనరావుగారు (వెదిర) 50-0-0

7. శ్రీ పల్లెర్ల హనుమంతరావుగారు (మహబూబునగరం) 75-0-0

## మెదకు జిల్లా

1. శ్రీ మార్క మల్లయ్యగారు (సిద్దిపేట) 50-0-0

2. శ్రీయుతులు చంద్రయ్య. శ్రీ వెంకటయ్యగార్లు (సిద్దిపేట) 50-0-0

## నిజామాబాదు జిల్లా

1. శ్రీ కే. ఆర్. రాజిరెడ్డిగారు (కామారెడ్డి) 50-0-0

2. శ్రీ ఎం. రాంగోపాల్‌రెడ్డిగారు (భోధన్) 50-0-0

3. శ్రీ బి. శాయిరెడ్డిగారు (మోత్ర) 50-0-0

## వరంగల్ జిల్లా

1. శ్రీ కోత్వాలు మధుసూధనరావుగారు (సంగెం) 250-0-0

2. శ్రీ పొట్లపల్లి రాంగోపాల్‌రావుగారు (వల్లగుట్ట) 267-0-0

3. శ్రీ కటికెనేని గోపాలరావుగారు .. 50-0-0

4. శ్రీ టి. హయగ్రీవాచార్యులుగారు (హనుమకొండ) 50-0-0

5. శ్రీ కోత్వాలు వీరభద్రరావుగారు (సంగెం) 200-0-0

6. శ్రీ పొట్లపల్లి రాంచంద్రరావుగారు (తాటికాయల) 100-0-0

7. శ్రీయుతులు పొట్లపల్లి రామారావు, శ్రీ రంగారావుగార్లు .. 100-0-0

8. శ్రీ సి. కృష్ణారెడ్డిగారు .. 50-0-0

9. శ్రీ పి. నర్సింహారెడ్డిగారు (రాజారం) 50-0-0

10. శ్రీ చింతకుంట్ల మాధవరెడ్డిగారు (ఘనపురం) 50-0-0

11. శ్రీ చింతకుంట్ల రంగారెడ్డిగారు ,, 50-0-0

12. శ్రీ లింగాల వెంకట రంగారెడ్డిగారు (జనగామ) 55-0-0

13. శ్రీ బి. రంగనాయకులుగారు (వరంగల్) 50-0-0

14. శ్రీ కాళోజి రామేశ్వరరావుగారు (హనుమకొండ) 50-0-0

15. శ్రీ తౌటిరెడ్డి రాంచంద్రారెడ్డిగారు (మడికొండ) 116-0-0

## నల్లగొండ జిల్లా

1. శ్రీ గుడిదేవుని మల్లేశంగౌడుగారు (దేవరకొండ) 116-0-0

2. శ్రీ గూడూరు రామానుజరావుగారు (ఆత్మకూరు) 100-0-0

3. శ్రీ జి. రామచంద్రారావుగారు (తిప్పల్‌నేనిగౌరారం) 50-0-0

4. శ్రీ టి. వెంకటార్రావుగారు (చెరుకుపల్లి) 90-0-0

5. శ్రీ నల్లవెల్లి వెంకట రామారెడ్డిగారు (తవుక్లాపురం) 50-0-0

6. శ్రీ సి. వెంకటరెడ్డిగారు (మిర్యాలగూడెం) 50-0-0

## ఖమ్మం జిల్లా

1. శ్రీ ఎం. హీరాలాల్‌రాయ్‌గారు (ఖమ్మం) 100-0-0

## ఆదిలాబాదు జిల్లా

1. శ్రీ ముద్దసాని జనార్దనరెడ్డిగారు (మంచిర్యాల) 276-0-0

2. శ్రీ ఎన్. వి. రాజారెడ్డిగారు (భీమారం) 250-0-0

3. శ్రీ సి. జగన్మోహన్‌రెడ్డి & Co, (మంచిర్యాల). 101—0—0

4. శ్రీ ఎన్. వి. రాజారెడ్డి & Co. (మంచిర్యాల) 116—0—0

## పశ్చిమగోదావరి జిల్లా

1. శ్రీ సి, హెచ్. పి. మూర్తిరాజుగారు,
ఎం. ఎల్. ఏ. (చిన నింద్రకొలను) 116—0—0

## కృష్ణా జిల్లా

1. శ్రీ ముద్దా నారాయణ శర్మగారు,
అడ్వకేట్ (విజయవాడ) 116—0—0